# మిత్రద్వయం

-. రచన. -
విశ్వప్రసాద్






# మిత్రద్వయం

## (ఏకాంక నాటికలు)

అతి మనోహరము లైన

అయిదు నాటికల సంపుటి

— రచన —

విశ్వప్రసాద్





ప్రచురణ
1956

మూల్యము : రూ. 2-0-0

2-00

సంపాదకుడు : 'ఛాయేశ్వర్'

వైశ్యరత్న ప్రింటింగ్ వర్క్సు, విజయవాడ-1.

# ఒక మాట—

ప్రదర్శనలకోసమని వ్రాసిన నాటికలివి. లోగడ అక్కడక్కడ ప్రదర్శింపబడినవి.

ఇందులోని నాటికలను ఎవరి అనుమతితోను నిమిత్తం లేకుండా ప్రతివారు ప్రదర్శించుకోవచ్చును. అయినా ప్రదర్శించదలచుకున్న వారు తప్పకుండా తెలియపరుస్తుంటారనే ఆశిస్తుంటాను.

మీ

విశ్వప్రసాద్

విశ్వప్రసాద్ యితర నాటికలు

తాజ్‌మహల్

ఇదే (నా) లోకం?

అసమర్ధులు

దగాకోర్

5

ఇందులో —

మిత్రద్వయం

నేటి విద్యార్థి

కుంభకోణం

భిక్షగాడు

ఓడిపోయాం....
....లేదు జయించాం !

6

1956 డిశంబరులోగా వెలువడనున్న
మరికొన్ని
## ప్రఖ్యాత రచనలు

1 ప్రేతము - ఛాయ (ఇలాచంద్ర జోషి )

2 సునీత (జైనేంద్రకుమార్ )

3 సుఖదా ( ,, )

4 కల్యాణి ( ,, )

5 కర్బలా ( ప్రేమ్‌చంద్ )

6 సంగ్రాం ( ,, )

శ్రీ

# పాత్రలు

★

| | | |
|---|---|---|
| డాక్టరు సంజీవరావు<br>వకీలు జ్ఞానేశ్వరరావు | } | ప్రాణ స్నేహితులు |
| ఎల్లయ్య<br>పుల్లయ్య | } | ప్రాణాలుతీసే స్నేహితులు |
| పిచ్చయ్య | | నౌకరు |
| రాధాకృష్ణ | | దేశ సేవకుడు |

★ ★ ★

[ డాక్టరు సంజీవరావు ప్రత్యేకగది. గదిలో మూడు కుర్చీలు, ఒక డ్రాయరు, లెదర్ బాక్స్, కొన్ని పేపర్లు వుంటాయ్. ప్లీడరు జ్ఞానేశ్వర్రావు వస్తాడు. ]

జ్ఞానే : ( నాలుగువైపుల చూసి ) డాక్టర్ ! డాక్టరుగారూ ! ( విసుగ్గా ) ఒరేయ్ డాక్టర్ ! ( సమాధానం లేదు ) పిచ్చయ్యా ! పిచ్చయ్యా !

(పిచ్చయ్య వస్తాడు.)

పిచ్చ : ఏం బాబూ ! పిలిచేరా ?

జ్ఞానే : ఏడిసినట్టే వుంది ! అంత గట్టిగా అరిస్తే యింకా పిలిచేరా అని అడుగుతావా ?

పిచ్చ : లోపల పనిలోవున్నాను బాబూ ! వినిపించలేదు.

జ్ఞానే : డాక్టరేడీ ?

పిచ్చ : ఇప్పుడే ఎవరోవచ్చి తీసుకెళ్ళారు బాబూ !

జ్ఞానే : నాన్ సెన్స్. ఎప్పుడువచ్చినా సరిగ్గా యింటిదగ్గరుండడు.

పిచ్చ : ఇప్పుడే వస్తానన్నారు బాబూ ! మిమ్మల్ని వుండమన్నారు.

జ్ఞానే : వస్తాడోయ్ ! రాకేమవుతాడు ? అంతవరకు ఆయనకోసం కూర్చోవాలిగా ! అందుకే, డాక్టర్లతోను, యాక్టర్లతోను స్నేహం చెయ్యకూడదన్నారు. డాక్టరుకు రోగులతోను, యాక్టరుకు రాగాలతోను తీరికే వుండదు.

పిచ్చ: వెళ్ళి, పిలుచుకురమ్మంటారా ?
జ్ఞానే: ఎందుకులే. తీరికచేసుకుని అతనే వస్తాడు.
పిచ్చ: కాఫీ తెమ్మంటారా ?
జ్ఞానే: అక్కర్లేదు. నువ్వెళ్ళి పని చూసుకో.

[ పిచ్చయ్య వెళ్ళిపోతాడు. జ్ఞానేశ్వర్రావు పేపరు తీసి, రెండుపంక్తులు చదివి మూసేస్తాడు. కొంతసేపు యేమీతోచక అటు యిటు తిరుగుతాడు. ముఖంలో చెప్పలేనంత విసుగు కనిపిస్తోంది. కోపంగా కుర్చీలో కూర్చుని మళ్ళీ పేపరు తీస్తాడు. బైట బూట్లుచప్పుడవుతుంది. జ్ఞానేశ్వర్రావు పేపరు ముఖానికి అడ్డంగా పెట్టుకొని కూర్చుంటాడు. ఇంతలో సంజీవరావు వస్తాడు. ]

సంజీ: అదేమిట్రా, జ్ఞానూ జీవసమాధి చేస్తున్నావ్ ?
జ్ఞానే: ( మాట్లాడడు )
సంజీ: ఒరేయ్, జ్ఞానేశ్వర్రావ్ ! నిన్నేరా !
జ్ఞానే: ( పేపరుతీసి ) ఓ, డాక్టరుగారా ! గుడ్మార్నింగ్ సార్ !
సంజీ: అదేమిట్రా ?
జ్ఞానే: (లేచి) ఫోసీ, డాక్టరు సంజీవరావుగారూ! నమస్కారాలండీ !
సంజీ: ఇవ్వాళ నీకేమైనా దెయ్యం పట్టిందేమిరా ; గారూ-గారూ, అంటున్నావ్ ?
జ్ఞానే: ఔను డాక్టర్ ! మీదగ్గర దెయ్యాలకు మందేమైనా వుందా ?
సంజీ: (నవ్వి) ఓ, యిప్పు డర్థమైంది—నీ కెందుకు దెయ్యం పట్టిందో ?

జ్ఞానే: సెలవివ్వండి!

సంజీ: నేను ఆలస్యంగా వచ్చినందుకు.

జ్ఞానే: (కొని తెచ్చుకున్న కోపంతో) నువ్వు ఆలస్యంగా వస్తే నాకేం? అసలు రాకపోతే నాకేం?

సంజీ: (నెమ్మదిగా) ఎక్స్క్యూజ్మి బ్రదర్! ఒక రోగిని చూడ్డానికి వెళ్ళాను. కొంచెం లేటయింది.

జ్ఞానే: ఈ లేటు నీకు రోజూ అలవాటేగా!

సంజీ: ఇవ్వాల్టికి క్షమించరా. రేపటినుంచి— అక్షరాల నాలుగున్నర అయ్యేసరికి, యింట్లోంచి బైటకెళ్ళను. సరేనా?

జ్ఞానే: ప్రతిజ్ఞలకేం?-లక్షాతొంభై చెయ్యొచ్చు. నీ కోసం అంతదూరంనుంచి వస్తున్నానన్న జ్ఞానం వుండాలి.

సంజీ: క్షమించరాబాబూ!-క్షమించు! పొరబాటే అయింది. చెంప లేసుకోమంటావా? (వేసుకోబోతాడు.)

జ్ఞానే: (చెయ్యి పట్టుకుని) వద్దులే; ఇవ్వాల్టికి క్షమించాను.

సంజీ: బ్రతికించావ్! కూర్చో.

(ఇద్దరూ కూర్చుంటారు.)

సంజీ: పిచ్చయ్యా! పిచ్చయ్యా!

(పిచ్చయ్య వస్తాడు.)

సంజీ: ప్లీడరుగారికి చల్లటి కాఫీ తీసుకురా.

పిచ్చ: (ఆశ్చర్యంగా) చల్లటిదా?

సంజీ : ఔను. ఈయన కీమధ్య కోర్టుపని ఎక్కువై బుర్ర వేడెక్కిపోతోంది. ఆ వేడి చల్లారడానికి చల్లటి కాఫీ కావాలి. వేడికాఫీ యిస్తే, బుర్ర మరీ వేడెక్కి నామీద యింకా రుసరుసలాడతాడు.

జ్ఞానే : ఏడిశావ్ ! తిరిగి నామీదే నేరం మోపుతున్నావా ?

సంజీ : నేరాలు మోపడం, బేరాలు కుదర్చడం – అన్నీ ప్లీడర్లకే తగునురా.

పిచ్చ : కాఫీ తెమ్మంటారా బాబూ ?

సంజీ : ఇంకా మెల్లగా అడుగుతున్నావా ?

జ్ఞానే : చల్లటిదిమాత్రం వద్దు.

పిచ్చ : నాకు తెలీదుబాబూ ? కాని అప్పుడప్పుడు మీ వేళాకోళాలు నిజమనుకుని మోసపోతుంటాను.

జ్ఞానే : సరేలే, వెళ్ళి త్వరగా కాఫీ తే.

(పిచ్చయ్య వెళ్ళిపోతాడు.)

సంజీ : ఈమధ్య పనులు మరీ ఎక్కువగా వున్నాయనుకుంటాను !

జ్ఞానే : ఎవరికి ?

సంజీ : నీకే.

జ్ఞానే : ఎందుకని ?

సంజీ : అహఁ ! కోర్టుపని ఎక్కువయ్యేకొద్దీ, ప్లీడర్లకి కోపం పెరుగుతుంది.

జ్ఞానే : నీకా, నాకా—పని ఎక్కువగావున్నది ?

సంజీ : నామాటకేం? కాని నీకు కోపం మితిమీరిపోతోందా లేదా?

జ్ఞానే : పైగా నాకు కోపం అంటావేమిరా? ప్రతిరోజు నాలుగున్నరకే వస్తున్నాను. కాని తమరి దర్శనం, సుదర్శనం అయిపోయింది!

సంజీ : ఇవ్వాళ ఒక్క ఐదు నిముషాలేగా ఆలస్యమైంది?

జ్ఞానే : ఐదు నిముషాలంటే వూరికే వున్నాయనుకున్నావా?

సంజీ : అబ్బే! ఎందుకనుకుంటాను? ఆ ఐదునిమిషాల్ని కోర్టులో వినియోగిస్తే, ఐదుపదు లొస్తాయనుకుంటాను.

జ్ఞానే : ఏడిశావ్! నువ్వుమాత్రం ఏం గాజులు తొడిగించుకుని కూర్చున్నావ్? రోజుకు ఏభై రూపాయలు సంపాదిస్తున్నావ్.

(పిచ్చయ్య కాఫీతో వస్తాడు.)

పిచ్చ : మీ గొడవ యింకా చల్లారలేదా, బాబూ?

సంజీ : ఇది రోజూ వుండేదేగా, పిచ్చయ్యా!

జ్ఞానే : కాఫీ త్రాగితే చల్లారుతుందిలే.

(ఇద్దరూ కాఫీ త్రాగుతారు.)

సంజీ : పిచ్చయ్యా! మా యిద్దరి స్నేహం యెప్పటినుంచో తెలుసా?

పిచ్చ : మీ రిద్దరు పుట్టినప్పటినుంచీ నేస్తులే బాబు!

జ్ఞానే : యువరానర్! పుట్టినప్పటినుంచేకాదు–పుట్టకపూర్వం నుంచీ మేం స్నేహితులమే.

సంజీ : ఏడిశావ్ ! ఇదేమీ కోర్టుకాదు-వాదించడానికి.

జ్ఞానే : సారీ ! మిష్టర్ పిచ్చయ్యా ! (నాలుక కరుచుకుని) పిచ్చయ్యా ! మేమిద్దరం పూర్వజన్మలో కూడ స్నేహితులమే !

సంజీ : వచ్చే జన్మలోకూడా యిలాగే వుంటాం.

జ్ఞానే : వచ్చే జన్మలోనేకాదు - సూర్య-చంద్రులు, నక్షత్రాలు, రాత్రి-పగలు, భూమి-ఆకాశం - వున్నన్నాళ్ళు మేం స్నేహితులుగానే వుంటాం.

(పిచ్చయ్య నవ్వుకుంటూ వెళ్ళిపోతాడు.)

సంజీ : ఒరేయ్, జ్ఞానూ !

జ్ఞానే : ఆఁ !

సంజీ : మనిద్దరిలో ఒకరు స్త్రీ అయితే ఎలాగుండేది ?

జ్ఞానే : చాలబాగుండేది.

సంజీ : ఆఁ ?

జ్ఞానే : ఔనురా. రాత్రింబవళ్ళు ఒకరినొకరు విడిచిపెట్టకుండా, కాలానికి అతీతులమై, నాలుగు కళ్ళనీ ఏకంచేసుకుని, సముద్రపుటొడ్డున, చల్లటి వెన్నెల్లో, చంద్రుణ్ణిచూస్తూ, నక్షత్రాలు లెక్కపెడుతూ (తన్మయత్వంతో) జీవాత్మల్ని ఏకంచేసుకుని, భూమిమీద నడుస్తూ, గాలిలో ఎగురుతూ, ఆకాశంలో విహరిస్తూ... ... ... ...ఓహోహో ! చెప్పాలంటే, శబ్దాలు దొరకడంలేదు.

సంజీ : నిజంరా. ఈ విషయంలో దేవుడు మనకు ద్రోహం చేశాడనేచెప్పాలి.

జ్ఞానే : సర్టెన్లీ.

(బైటనుంచి "డాక్టరుబాబూ! డాక్టరుబాబూ!" అని పిలుపు వస్తుంది. పిచ్చయ్య వస్తాడు.)

పిచ్చ : నిన్నవచ్చిన ముసలమ్మకు చాల ప్రమాదంగా వుందట బాబూ ! ఆపిల్ల వచ్చి ఏడుస్తోంది.

సంజీ : వస్తున్నా ! నువ్వు బాక్స తీసుకెళ్లు.

(పిచ్చయ్య లెదర్ బాక్స్ పట్టుకెళతాడు.)

జ్ఞానే : ఏడిసినట్టే వుంది.

సంజీ : ఎక్స్‌క్యూజ్మి బ్రదర్ ! ఇప్పుడే వస్తాను.

జ్ఞానే : నేను వెళతాను.

సంజీ : నో. నువ్వెళ్లితే, నన్ను చంపుకుతిన్నట్టే. పాపం ! చాల ప్రమాదంలోవుంది. చూసి యిప్పుడే వస్తాను.

(గబగబా వెళ్ళిపోతాడు.)

జ్ఞానే : ఏడిసినట్టేవుంది. వీడితోస్నేహం విరమించుకుంటేనే బాగుండేటట్లు వుంది. కాని అలా చెయ్యలేకపోతు న్నాను.

(కుర్చీలో కూర్చుని పేపరు చదువుతుంటాడు. ఇంతలో ఎల్లయ్య, పుల్లయ్య వస్తారు.)

ఎల్ల : (పుల్లయ్యతో) ఎల్లయ్య దెబ్బకి ఏనుగు వణుకుతుంది!

పుల్ల : (ఎల్లయ్యతో) పుల్లయ్యపిలుపుకు పులి బెదురుతుంది !

ఎల్ల : ఈ ఎల్లయ్య ఏనుగులాంటి మనిషి !

(మీసం దువ్వుతాడు.)

పుల్ల : ఈ పుల్లయ్య పులిలాంటి మనిషి !

(గోషం చూపిస్తాడు.)

ఎల్ల : ఎల్లయ్య తలుచుకుంటే ఏనుగుమీద ఊరేగిస్తాడు !

పుల్ల : పుల్లయ్య అనుకుంటే పులిమీద కూర్చోబెట్టి పూజలు చేయిస్తాడు !

ఎల్ల : ఈ ఎల్లయ్య, పుల్లయ్యలు కలిస్తే... ...

పుల్ల : ఏమైనా చేస్తారు.

జ్ఞానే : ఏమిటోయ్, విశేషం ?

ఎల్ల : ముక్కు పిండేస్తాం.

పుల్ల : మూడుచెరువులనీళ్ళు తాగిస్తాం.

ఎల్ల : డొక్కలు చీల్చేస్తాం.

పుల్ల : మా పిక్కబలం చూపిస్తాం.

జ్ఞానే : ( కొంచెం కోపంగా ) ఎవర్నోయ్ ?

ఎల్ల : మాట వినని వాళ్ళని.

పుల్ల : పోటీకి నిలబడే వాళ్ళని.

ఎల్ల : వోటు వెయ్యమన్న వాళ్ళని.

పుల్ల : గీటుదాటిన వాళ్ళని.

ఎల్ల : మాటాడితే చీల్చేస్తాం.

పుల్ల : చటుక్కున కాల్చేస్తాం.

జ్ఞానే : ( విసుగ్గా ) అబ్బా ఏమిటోయ్, ఆ గొడవ ?

ఎల్ల : ( పుల్లయ్యవంక చూస్తూ ) ఏముంది ?

పుల్ల : (ఎల్లయ్యవంక చూస్తూ) ఏమీ లేదు !
జ్ఞానే : (కోపంగా) అయితే ఎందుకలా వాగుతారు ?
ఎల్ల : పుల్లయ్యా !
పుల్ల : ఏం, ఎల్లయ్యా ?
ఎల్ల : మనకు తెలుసుగా !
పుల్ల : ముందే విన్నాంగా !
ఎల్ల : ఈయనకు పౌరుషం జాస్తీ అని,
పుల్ల : పలుకుబడి నాస్తి అని !
జ్ఞానే : (కోపంగా) ఎవరన్నారు ?
ఎల్ల : (పుల్లయ్యవంక చూపిస్తాడు.)
పుల్ల : (ఎల్లయ్యవంక చూపిస్తాడు.)
ఎల్ల : (నెమ్మదిగా) ఊరంతా అంటోంది.
పుల్ల : కోడై కూస్తోంది.
జ్ఞానే : ఏమని ?
ఎల్ల : మీకు కోర్టులో మాట్లాడ్డం తప్పిస్తే......
పుల్ల : కేసులు కొట్టించేయడం మినహాయిస్తే......
ఎల్ల : ఇంకేమీ తెలియదట !
పుల్ల : (చప్పరిస్తూ) పాపం !
జ్ఞానే : అసలు సంగతేమిటో సరిగ్గా చెప్పండోయ్.
ఎల్ల : (పుల్లయ్యతో) చెప్పమంటావా ?
పుల్ల : తప్పుతుందా ?
ఎల్ల : అందులోను మనవూరికి పెద్దప్లీడరుగారాయె !
పుల్ల : చెప్పకపోతే మన తద్దినం పెట్టిస్తారాయె !
ఎల్ల : (జ్ఞానేశ్వర్రావుతో) మన్నించాలి.

పుల్ల : క్షమించాలి.

ఎల్ల : నెమ్మదిగా వినండి.

పుల్ల: మమ్మల్నేమీ అనకండి.

జ్ఞానే : త్వరగా చెప్పండోయ్.

ఎల్ల : మీకింకా తెలీదా ?

పుల్ల: మీరింకా వినలేదా ?

ఎల్ల: ఏ సందులోవిన్నా యిదే సందడి !

పుల్ల: ఏ గొందిలో చూసినా యిదే అలజడి !

ఎల్ల : ఏ మగాడు చెప్పినా యిదేమాట !

పుల్ల: ఏ ఆడది పాడినా యిదేపాట !

జ్ఞానే : (విసుగ్గా, సాగదీస్తూ) అ-స-లు —— సం-గ-తే-మి-టో-య్!

ఎల్ల : (పుల్లయ్యతో) చెప్పమంటావా ?

పుల్ల : తప్పుతుందా ?

ఎల్ల : (జ్ఞానేశ్వరావుతో) ఎలక్షన్లు దగ్గరకొచ్చాయికదండీ ?

పుల్ల : ప్రతివాళ్ళకు యింజక్షను పొడిచినట్లుంది.

జ్ఞానే : ఏడిసినట్లేవుంది. ఇదా మీ ఏడుపు !

ఎల్ల : పుల్లయ్యా !

పుల్ల : ఏం ఎల్లయ్యా ?

ఎల్ల : మనది ఏడుపట !

పుల్ల : కాదు మరి !

ఎల్ల : మనకోసం ఏడుస్తున్నా మనుకున్నా రేమో !

పుల్ల : మన కడుపుకోస మనుకున్నా రేమో !

ఎల్ల : చెప్పినా తెలుసుకోరు !

పుల్ల : పప్పులో అడుగువేశారు.
ఎల్ల : ఆ తంత్రాలు తెలిస్తేగా!
పుల్ల : ఆ మంత్రాలు వస్తేగా!
ఎల్ల : డాక్టరుగారి బుర్రే బుర్ర!
పుల్ల : ట్రాక్టరులా పనిచేస్తుంది!
ఎల్ల : గోడమీది పిల్లివాటం!
పుల్ల : గొంతుకు పిసికేరకం!
జ్ఞానే : ఏమిటోయ్, ఈ వ్యర్థ ప్రసంగం?
ఎల్ల : పుల్లయ్యా!
పుల్ల : ఏం ఎల్లయ్యా?
ఎల్ల : మనది వ్యర్థప్రసంగమట?
పుల్ల : అర్థం తెలిస్తేగా!
ఎల్ల : చిటుకలువేస్తూ బల్ల గుద్దడం కాదు.
పుల్ల : కిటుకు తెలుసుకోవాలి.
జ్ఞానే : మీ రేదో కుంభకోణం చెయ్యబోతున్నట్టుందే?
ఎల్ల : రామ! రామా!
పుల్ల : శివ! శివా!
జ్ఞానే : అసలు సంగతేమిటో సరిగ్గా చెప్పండి. లేకపోతే మీమీద "న్యూసెన్సుకేస్" పెడతాను.
ఎల్ల : పట్టిస్తారా?
పుల్ల : కొట్టిస్తారా?
ఎల్ల : ఔను, మరి! నిజంచెబితే నిష్ఠూరమే.
పుల్ల : కాదు, మరి! సగం దాచడంకూడ కష్టమే.
జ్ఞానే : ఆ సంగతేమిటో సరిగ్గా చెప్పకూడదూ?

ఎల్ల : చెప్పాలనే వచ్చాం.

పుల్ల : చెప్పి వెళతాం.

ఎల్ల : ( నెమ్మదిగా ) ఈ ఎన్నికల్లో డాక్టరుగారుకూడ పోటీ చేస్తున్నారు.

పుల్ల : వోటులకోసం యింటింటికి వెళ్లి అడుగుతున్నారు.

జ్ఞానే : ( సంతోషంగా ) నిజమా?

ఎల్ల : గొయ్యితీసి పాతేసినా అబద్ధమాడం.

పుల్ల : వెయ్యి రూపాయలిస్తామన్నా నిజాన్ని విడువం.

జ్ఞానే : వెరీగుడ్, అయితే డాక్టరు తప్పకుండా గెలుస్తాడు.

ఎల్ల : ఔనౌను ...

పుల్ల : అదే అనుకున్నాం.

జ్ఞానే : కాని, యింతవరకు నా కా విషయం చెప్పలేదే!

ఎల్ల : ఎందుకు చెబుతారు? ...

పుల్ల : ఆయనకు పోటీ నిలబడతారని భయం!

జ్ఞానే : ఛా!

ఎల్ల : ఆయనకు సాటి ఎవ్వరూలేరు? ఆయనదే విజయం...

పుల్ల : అని వూరంతా అంటోంది.

జ్ఞానే : నిజం, డాక్టరు తప్పకుండా గెలుస్తాడు. అతను చేస్తున్నసేవ, అతనికున్న పలుకుబడి, అతనికి తప్పకుండా విజయాన్ని చేకూరుస్తాయి.

ఎల్ల : పుల్లయ్యా!

పుల్ల : మరే, ఎల్లయ్యా.

ఎల్ల : మనం విన్నమాటలు పొరపాటుకాదు.

పుల్ల : ఆయన గ్రహపాటుకు మనమేం చేస్తాం?

జ్ఞానే : ఏం విన్నారు మీరు ?

ఎల్ల : చెప్పడమెందుకు లెండి ...

పుల్ల : తప్పు మాదవుతుంది.

జ్ఞానే : అయితే, యిక్కడనుంచి పొండి. ఆ వాగుడెందుకు?

ఎల్ల : చూడు, పుల్లయ్యా ! ఆడలేనిబొమ్మ మద్దిల్ని తన్నిందట !

పుల్ల : మరే, ఎల్లయ్యా! పాడలేనిఅమ్మ పిడేల్ని విరచిందట!

జ్ఞానే : ఏమిటోయ్, ఈగొడవ? బైటకుపొండి.

ఎల్ల : ఎలా పొమ్మంటారు చెప్పండి ?

పుల్ల : అలా అంటే ఎలా చూడండి ?

ఎల్ల : డాక్టరుగారు ఏమన్నారో తెలుసా ?

పుల్ల : ఆయన్ని ఓడించేవాళ్లు ఎవ్వరూ లేరట !

ఎల్ల : అప్పుడు నేనేమన్నానో తెలుసా ?... ...

పుల్ల : ప్లీడరుగారు పోటీచేస్తే మీకు ఒక్కవోటుకూడ రాదన్నాడు.

ఎల్ల : ఆ మాట వినేసరికి తాచుపాములా బుస్సునలేచి ...

పుల్ల : కస్సుమన్నారు !

ఎల్ల : 'ప్లీడరు కేం తెలుసోయ్, పిచ్చిపుల్లయ్యా ! వాడి ముఖంచూస్తేనే ప్రతివాడికి అరికాలిమంట నెత్తికెక్కుతుంది' అన్నారు.

పుల్ల : 'ప్లీడరుగారికి చాల పలుకుబడివుంది' అనేసరికి... ...

ఎల్ల : 'ఏడిశావ్ ! వాడిబ్రతుక్కి పలుకుబడికూడానా ? ముక్కూ - మొహం ఎరగని ముండమోపు సన్యాసి' అన్నారు.

జ్ఞానే : ఆఁ!
ఎల్ల : అక్షరాల ఆయనే గెలిచితీరాలట!
పుల్ల : లక్షణంగా ఆ కుర్చీలో ఆయనే కూర్చోవాలట!
జ్ఞానే : (ఈర్ష్యగా) అలా అన్నాడేం?
ఎల్ల : మీకు డబ్బుమీద మహా ఆశట!
పుల్ల : ఆయన డబ్బులన్నీ వూరకే చేస్తున్నారట!
ఎల్ల : మీరు ప్రజల్ని పీడించి డబ్బు లాగుతారట!
పుల్ల : ఆయన ప్రజలకు ఎంతో మేలుచేశారట!
ఎల్ల : అందుచేత, ఆయనే ఆపదవికి అర్హులట!
పుల్ల : మీరు అన్నివిధాల అనర్హులేనట!
జ్ఞానే : (కోపంగా) ఆఁ! అంత అహంభావమా?
ఎల్ల : ఇంకా చాలా అన్నారు.
పుల్ల : చెబితే మీకు మరీ కోపం వస్తుంది.
జ్ఞానే : ఎంత మోసం!
ఎల్ల : మోసం లేని వాళ్ళెవరండీ?
పుల్ల : అంతా వేషగాళ్ళేనండీ!
జ్ఞానే : ఇంతసేపు ఎంత తియ్య తియ్యగా మాట్లాడాడు? 'మనిద్దరిలో ఒకరు స్త్రీ అయితే ఎంత బాగుండేది!' అన్నాడు. అంతా మోసమే! ఎంతో స్నేహం, ప్రేమ వున్నట్టు ఎంత తెలివిగా నటించాడు?
ఎల్ల : నటనలేకుంటే నాలుగుడబ్బులు సంపాదించుకోడ మెలా? ఏం పుల్లయ్యా?
పుల్ల : అంతే ఎల్లయ్యా!
జ్ఞానే : ఛీ! ఛీ! లోపలొకటి, పైకొకటి! ఎంతద్రోహం!

ఎల్ల : మీ స్నేహం యింతపని చేసింది.
పుల్ల : ఆయనంతటి స్నేహితుడు లేడన్నారు.
ఎల్ల : శరీరాలే వేరుగాని... ... ...
పుల్ల : ఆత్మలొకటే, అన్నారు.
ఎల్ల : అంతా నాటకమండీ !
పుల్ల : పూర్తిగా బూటకమండీ !
జ్ఞానే : అర్థమైంది. అంతా అర్థమైంది.
ఎల్ల : పైగా, మీరు పోటీచేస్తే, ఒక్క వోటుకూడ రాదట !
పుల్ల : ఆయనకు సాటి లేనేలేరట !
జ్ఞానే : ( కోపంగా ) ఆఁ! చూస్తాను. ఆసంగతికూడ చూస్తాను. ఇదేదో పూర్తిగా అంతు కనుక్కుంటాను.
ఎల్ల : ఈ ఎన్నికల్లో ఆయనతో పోటీచేసేవాళ్ళకు తన్నులు తప్పవట !
పుల్ల : కన్నులు పొడిపించి, సున్నం పెట్టిస్తాడట !
జ్ఞానే : ( చాల కోపంతో ) ఇహ, చాలించండి.
ఎల్ల : క్షమించండి. మీ మీద వుండే అభిమానంకొద్దీ చెప్పాం.
పుల్ల : లేకపోతే మా కిందులో వచ్చిపడేదేముంది ?
ఎల్ల : పద, పుల్లయ్యా ! పోదాం.
పుల్ల : రా, ఎల్లయ్యా ! వెడదాం.

( ఇద్దరూ వెళ్ళడానికి సిద్ధమౌతారు. )

జ్ఞానే : ఇదుగో, యిలా రండోయ్.

( ఇద్దరూ ఆగుతారు )

జ్ఞానే : నేనూ యెన్నికల్లో నిలబడతాను.

ఎల్ల : (సంతోషంతో) అద్గదీ వరస.

పుల్ల : (చిటికవేసి) అలాగుండాలి పస.

జ్ఞానే : మీరు బాగా ప్రచారం చెయ్యగలరా?

ఎల్ల : అది వేరే అడగాలా? ఎల్లయ్య 'ఏయ్' అంటే, ఏనుగు పలుకుతుంది!

పుల్ల : పుల్లయ్య పిలుపువింటే, పులి పరుగెత్తుకుంటూ వస్తుంది.

జ్ఞానే : (కోపంగా) డాక్టరుగాడి నామరూపాలు లేకుండా పోవాలి.

ఎల్ల : అక్షరాల ... ... ...

పుల్ల : అంతే!

జ్ఞానే : మనకు గెలుపు ఖాయమేనా?

ఎల్ల : ఇంకా అనుమానమా? కుంటీ-గుడ్డీ అందరివోట్లూ మీకే వేయిస్తాం.

పుల్ల : ఆడా-మగా అందరివోట్లు మీకే వస్తాయి.

జ్ఞానే : అయితే, బాగా ప్రచారంచెయ్యండి. డాక్టరుగాడు చేసిన ద్రోహానికి సరిగ్గా బుద్ధిచెప్పాలి.

(జేబులోంచి రెండువందల రూపాయలు తీసి యిస్తాడు)

ఎల్ల : (అందుకుని) రెండు వందలేనా?

పుల్ల : రెండు గంటలక్కూడ చాలవు.

జ్ఞానే : ఎంత కావాలంటారు?

ఎల్ల : కనీసం వెయ్యి రూపాయలైనా వుండాలి.

పుల్ల : అందులో వీసమైనా మాకురాదు.

జ్ఞానే: అందాకా ఈ నాలుగు వందలతోను పని ప్రారంభిం
చండి. మళ్ళీ తర్వాత యిస్తాను.

(మరొక రెండువందలు యిస్తాడు.)

ఎల్ల: సరే, అందాకా పని ప్రారంభిస్తాం.
జ్ఞానే: జాగ్రత్త! మిమ్మల్ని నమ్ముకుని ఈపనిలో దిగు
తున్నాను. అపజయమన్నమాట వుండకూడదు.
ఎల్ల: (పుల్లయ్యవంక చూస్తూ) అది మనకు తెలీదూ?
పుల్ల: తెలుసు, తెలుసు.
జ్ఞానే: ఎంతడబ్బైనా సరే, వెనుకంజవేసేది లేదు.
ఎల్ల: అదీ మాకు తెలుసు.
పుల్ల: ముందే అనుకున్నాం.

(సైట బూట్లుచప్పుడు అవుతుంది.)

జ్ఞానే: అడుగో! డాక్టరుగా డొస్తున్నాడు. వాడి ముఖం
కూడ చూడకూడదు. మిత్రద్రోహి. శుద్ధ పశువు.
ఎల్ల: చద్ది మనిషి.
పుల్ల: మొద్దావతారం.
జ్ఞానే: నే వెళుతున్నాను. మీరు మాయింటికి రండి. అన్నీ
అక్కడ సావకాశంగా మాట్లాడదాం.
ఎల్ల: ఇప్పుడే వస్తాం, మీరు పదండి.
పుల్ల: తప్పకుండా వస్తాం, మీరు నడుస్తుండండి.

(జ్ఞానేశ్వర్రావు చరచరా వెళ్ళిపోతాడు.)

ఎల్ల: పుల్లయ్యా! ఎలాగుంది?
పుల్ల: సగంరొట్టె నేతిలో మునిగింది.

ఎల్ల : ఇహ, మిగిలింది మునుగుతుంది.

పుల్ల : పూర్తిగా ముంచే పోతాం.

ఎల్ల : ప్లీడర్నే పట్టికొట్టించాం.

పుల్ల : డాక్టరొక లెఖ్ఖా ?

[ బైట ఎవరో, ఎవర్నో చెంపమీద కొట్టిన శబ్దం వినిపిస్తుంది. ఎల్లయ్య పుల్లయ్య ఒకరిముఖం మరొకరు చూసుకొంటారు. ఇంతలో సంజీవరావు వస్తాడు. ముఖం ఎర్రబడింది. కళ్ళల్లోంచి అగ్నికణాలు ప్రజ్వలిస్తున్నాయ్. ]

సంజీ : (గట్టిగా) పిచ్చయ్యా ! పిచ్చయా !

( పిచ్చయ్య కంగారుగా వస్తాడు )

పిచ్చ : ఏం బాబూ !

సంజీ : ఆ జ్ఞానేశ్వర్రావుగాడ్ని ఏమైనా అన్నావా ?

పిచ్చ : మీరు వెళ్ళాక నే నిక్కడకు రానేలేదు, బాబూ !

సంజీ : అయితే, వాడెందుకంత బ్రూట్‌లా ప్రవర్తించాడు!
(కుర్చీలో కూర్చుంటాడు.)

పిచ్చ : ఏంచేశారు బాబూ ?

ఎల్ల : ఏంచేస్తాడు ? చవటలా వ్యవహరించివుంటాడు.

పుల్ల : మోటుగా మాట్లాడివుంటాడు.

ఎల్ల : పళ్ళు పటపట కొరికివుంటాడు.

పుల్ల : చెంప 'ఛెళ్' మనిపించివుంటాడు.

పిచ్చ : ఆఁ !

ఎల్ల : 'ఆఁ' లేదు, 'ఊఁ' లేదు. రెండు రాళ్ళు సంపాదించే సరికి వాళ్ళు పొగరెక్కుతుంది.

పుల్ల : పొద్యే కాలందగ్గరకొస్తే, కళ్ళుపొరలుకమ్ముతాయ్.

సంజీ : (కోపంగా) ఫూల్, రాస్కెల్, బ్రూట్, డామిట్, యిడియట్ ... ... ...

ఎల్ల } (కంగారుగా) ఎవరు?
పుల్ల }

సంజీ : వాడే. ఆ ప్లీడరుగాడే. ఆ అజ్ఞానిగాడే. వెధవ! వెధవన్నర వెధవ! మనిషంత మనిషిని అకారణంగా కొడతాడూ?

ఎల్ల : కొట్టడమే!
పుల్ల : తిట్టడమైనా కాదు!
ఎల్ల : ఎంత ధైర్యం!
పుల్ల : ఎన్ని వేల గుండె లున్నాయని!

సంజీ : చూస్తాను - ఎన్ని వేల గుండెలున్నాయో! అకారణంగా - ఏమోయ్, పోతున్నావంటే, చుర చుర చూస్తాడూ? చెయ్యి పట్టుకుని లోపలకు రమ్మంటే, చెంపమీద కొడతాడూ? సన్యాసి, దౌర్భాగ్యపు సన్యాసి.

పిచ్చ : చెయ్యి చేసుకోడానికి అతనికేం అధికారముందని?
ఎల్ల : అధికారంకోసమే ఈ అత్యాచారం.
పుల్ల : ముందే హడలగొడదా మనుకున్నాడు!
ఎల్ల : ఏమైతే ఏం? డాక్టరుగారికున్న పేరుప్రతిష్టలు పోతాయా?

పుల్ల : వాడికి లేనివి రమ్మంటే వస్తాయా?
ఎల్ల : వూరంతా కోడై కూస్తోంది.

పుల్ల : ఒక్కమాటమీద నిలబడి కలవరిస్తోంది.

ఎల్ల : డాక్టరుగారికి తప్ప యింకెవరికీ ఒక్క వోటుకూడా వెయ్యమన్నారు.

పుల్ల : నిక్కచ్చిగా ఆయనకే అందరూ వేస్తామన్నారు.

ఎల్ల : అందుకే అతని ఏడుపంతా ?

సంజీ : (అర్థంకాక) ఏమిటోయ్, ఎల్లయ్యా ! —నువ్వనేది?

ఎల్ల : ఆఁ! ఏముందండీ? ఎన్నికలు వచ్చాయికదూ? అంతా కలిసి మిమ్మల్ని నిలబడమని చెప్పమన్నారు.

పుల్ల : 'సరే ! అలాగే చెబుతాం.' అని వచ్చాం.

ఎల్ల : ఆ ప్లీడరయ్య యిక్కడ కూర్చుని 'ఏమిటోయ్, విశేషాలు ?' అన్నాడు.

పుల్ల : 'ఏముంది ! మన డాక్టరుబాబును ఎన్నికల్లో నిలబడమని అంతా కోరుతున్నారు' అన్నాం.

ఎల్ల : అనేసరికి సింహగర్జనలా.........

పుల్ల : ఘీంకరించాడు.

ఎల్ల : గంగిరెద్దులా.........

పుల్ల : రంకెలు వేశాడు.

సంజీ : ఆఁ ! అదా సంగతి !

ఎల్ల : చాలా వుంది.

పుల్ల : బాగా వినండి.

ఎల్ల : 'ఆ డాక్టరుగాడికి సూదులుగుచ్చి డబ్బులాగడం తప్పితే యింకేమీ తెలీదు.........

పుల్ల : 'లేని రోగాలు సృష్టించి, కొంపలు కూలదొయ్యడం మినహాయిస్తే, వాడుచేసే దేమీలేదు.........

ఎల్ల : 'పేరుకోసం పాకులాడే శుంఠ......

పుల్ల : 'వాడిపేరంటేనే అందరికీ మంట......

సంజీ : (ఆశ్చర్యంగా) ఆఁ! అంత పొగరుబోత్తనంగా వాగాడేం?

పుల్ల : ఇంకా వినండి.

ఎల్ల : 'అయినా అతను లోలోపల యింత చేస్తున్నప్పుడు నేనుమాత్రం వూరుకుంటానా? ... ... ...

పుల్ల : 'ఎంతడబ్బైనా ఖర్చుపెట్టి అతని అంతు కనుక్కుంటాను... ... ...

ఎల్ల : 'ఎంత అపాయమైనా సరే... ... ...

పుల్ల : 'నా ప్లీడరీ బుర్ర నుపయోగించి, ఉపాయాలతో వాడి అంతు కనుక్కుంటాను... ... ...

ఎల్ల : 'అటువంటి కూపస్థ మండూకానికి యిలాంటి పదవు లిస్తే, దేశం నాశనమైపోతుంది ... ... ...

పుల్ల : 'వాడిలాంటి మిత్రద్రోహిని మామూలుగా విడిచి పెట్టను ... ... ...

సంజీ : (కోపంతో) ఆఁ! ఎంత కళ్ళు మీదకొచ్చాయ్, వాడికి? ఎంత కృతఘ్నుడు! చేసిన ఉపకారాలన్నీ మరిచిపోయి ... ... ...

ఎల్ల : ఉపకారికి, అపకారముసేయువాడె ... ... ...

పుల్ల : ఈ రోజుల్లో, ధన్యుడు సుమతీ!

ఎల్ల : లోకమే యిలా వుంది.

పుల్ల : పోకడే అలా వుంది.

ఎల్ల : ఇప్పుడుగనక మీరు వూరుకున్నారంటే అతని తల బిరుసు యింకా ఎక్కువై పోతుంది.

పుల్ల : ఇంత అయినతర్వాత యింకా వూరుకోడమా ? ఆరు మూడైనా, మూడు ఆరైనా, డాక్టరుగారు ఎలక్షన్లో నిలబడవలసిందే.

ఎల్ల : వూరంతా మీకే వోటిస్తుంది,

పుల్ల : మీ మాటమీద నిలబడుతుంది.

( సంజీవరావు ఆలోచిస్తుంటాడు. ఒక్కక్షణం నిశ్శబ్దం. )

సంజీ : ( ఆలోచిస్తూ ) పిచ్చయ్యా !

పిచ్చ : ఏం బాబూ !

సంజీ : కాఫీ తీసుకురా.

పుల్ల : మేం తాగేవచ్చాం.

ఎల్ల : డాక్టరుగారు యిస్తామంటే తాగేవచ్చామంటావేం ? ఆయనకు కోపంవస్తుంది.

పుల్ల : అలాగా, సరే.

సంజీ : పిచ్చయ్యా ! మూడు గ్లాసులతో తీసుకురా.

( పిచ్చయ్య లోపలకు వెళతాడు. )

ఎల్ల : డాక్టరుగారూ ! ఎవరినోటచూచినా మీ మాటే !

పుల్ల : ఎవరు పాడినా మీ పాటే !

ఎల్ల : మీరు చేసిన సేవ, మీ పలుకుబడి, మీ ప్రతిష్ఠ, గౌరవం ... ... ...

పుల్ల : మీ ఉదారత్వం, మంచితనం, ఓర్పు ... ... ...

ఎల్ల : ఎవరికొస్తాయండీ ?

పుల్ల : అందుకే, అంతా మీరే నిలబడాలంటున్నారు.
సంజీ : నిలబడమంటారా ?
ఎల్ల : ఇంకా సందేహమా ?
సంజీ : మనకు ప్రచారం ... ... ... ?
పుల్ల : మేమున్నాంగా !
సంజీ : మీరుకూడ సహాయం చేస్తారా ?
ఎల్ల : సహాయమేమిటండీ ? అది మాధర్మం.
పుల్ల : మర్మంలేకుండా చేస్తాం.
సంజీ : నేను గెలుస్తానంటారా ?
ఎల్ల : హుం ! ఇంకా నెమ్మదిగా అడుగుతున్నారా ? ఎవరున్నారిక్కడ ? ఎల్లయ్య. ఎల్లయ్యంటే ఏనుగులాంటివాడు.
పుల్ల : ఈ పుల్లయ్యంటే, పులిలాంటివాడు.
ఎల్ల : ఎల్లయ్య పుల్లయ్యలు కలిసేరంటే... ... ...
పుల్ల : కాని పని వుందా అంట ?
ఎల్ల : గానుగలా వూరంతా తిరుగుతాం.
పుల్ల : రోగులచేతకూడ ఓట్లు వేయిస్తాం.
ఎల్ల : ఏనుగుమీద వూరేగిస్తాం.
సంజీ : అయితే కానివ్వండి. ఆ జ్ఞానేశ్వరావు యీ దెబత్తో... ... ...
ఎల్ల : దెయ్యమై ఊరంతా తిరగాలి.
పుల్ల : దిష్టిబొమ్మలా ఊరుబైట వుండాలి.
సంజీ : (కోపంగా) ఔను. వాడి అహంభావం, తలబిరుసుతనం—అన్నీ వదలాలి.

ఎల్ల : జబ్బు పూర్తిగా కుదరాలి.
పుల్ల : డబ్బుకూడ నాశనం కావాలి.
సంజీ : అణాకానీకి పనికిరాని వెధవ; నన్ను కొట్టడం, నా మీద పోటీచెయ్యడమూనా?
ఎల్ల : ఎంత అవమానం!
పుల్ల : ఎంత అప్రతిష్ట!
సంజీ : అందుకే వాడిని పూర్తిగా నాశనంచేసి... ...
ఎల్ల : తల గొరిగి... ... ...
పుల్ల : ఊరంతా వూరేగిస్తాం.
సంజీ : కానివ్వండి. గట్టిగా ప్రయత్నం చెయ్యండి. (ఆగి, కోపంతో) పైగా ప్లీడరట!—ప్లీడరు! ఇలాంటి వాళ్ళను చాలమందిని చూశాను నేను. ఈరోజుల్లో ప్రాక్టీసులేని ప్రతి Pleader మొదటి P తీసిపారేసి Leader అవ్వాలనుకుంటున్నాడు. జాగ్రత్త? ఎంత డబ్బైనా సరే, యిలాంటివాళ్ళను లేవనివ్వకూడదు.
ఎల్ల : అది మాకు తెలీదూ?
పుల్ల : తెలుసు, తెలియకేం!
సంజీ : డబ్బు ఎంతైనా ఖర్చుపెడతాను.
ఎల్ల : డబ్బుకేంలెండి; కాని... ... ...
పుల్ల : మిమ్మల్ని అడగడానికి నోరు రావడంలేదు.
సంజీ : ఇందులో మొహమాట మెందుకు?
ఎల్ల : మీరు నా భార్య నొకసారి బ్రతికించారు.
పుల్ల : నా పెద్దకుర్రాడికి ప్రాణాలు పోశారు.
ఎల్ల : ఎలా అడగ్గలం చెప్పండి?

సంజీ : మీరు అడక్కపోయినా నే నిస్తాను. (డ్రాయరు లోంచి తీసి) ఈ నాలుగు వందలు తీసుకెళ్ళండి.

ఎల్ల : (తీసుకుని) పుల్లయ్యా! నాలుగొందలు సరిపోతా యంటావా?

పుల్ల : అదే ఆలోచిస్తున్నాను. ఎంతలేదన్నా యిప్పుడు పదివందలైనా వుండాలి.

సంజీ : (మళ్ళీ డ్రాయరుతీసి) అయితే, అందాకా ఈ ఆరు వందలు తీసుకెళ్ళండి. తర్వాత చూద్దాం.

ఎల్ల : ఏం పుల్లయ్యా! డాక్టరుగారిమాట విన్నావా?

పుల్ల : సరే, డాక్టరుగారొకటి, మనమొకటీనా?

ఎల్ల : ఇంకాపడితే మనచేతిడబ్బు పెడదాం.

పుల్ల : అవసరమైతే పెళ్ళాం పుస్తికూడా. తాకట్టుపెడదాం.

సంజీ : పనిమాత్రం జాగ్రత్తగా చెయ్యాలి.

ఎల్ల : ఆ భారమంతా మా బుజాలమీద వుంచండి.

పుల్ల : అంతా మేం మోస్తాంకదండీ!

ఎల్ల : ఇహ, వెళ్లొస్తాం డాక్టరుగారూ!

పుల్ల : మళ్ళీ కలుసుకుంటాం!

(వెళ్ళబోతారు. ఇంతలో పిచ్చయ్య కాఫీ తెస్తాడు.)

సంజీ : కొంచెం కాఫీ త్రాగి వెళ్ళండి.

ఎల్ల : ఏమంటావ్, పుల్లయ్యా?

పుల్ల : డాక్టరుగారిమాట దాటగలమా, ఎల్లయ్యా?

(పిచ్చయ్య ముగ్గురకు కాఫీ యిస్తాడు. ఎల్లయ్య, పుల్లయ్యలు కొంచెం త్రాగి పూసేస్తారు.)

ఎల్ల : అబ్బా! చేదు విషంరా, ఫుల్లయ్యా!

ఫుల్ల : ఏమైనా మందు కలిపేవేమిరా పిచ్చయ్యా?

సంజీ : మీకు పంచదార చాల్లేదేమో!

పిచ్చ : లోపల కల్మషముంటే కాఫీకూడా చేదుగానే వుంటుంది బాబయ్యా.

ఎల్ల : ఏడిశావ్.

ఫుల్ల : నోరుముయ్. ( గ్లాసులు క్రింద పెట్టి ఇద్దరూ వెళ్ళిపోతారు. )

పిచ్చ : బాబూ!

సంజీ : ( ఆలోచనలో వుంటాడు )

( రెండు క్షణాలు నిశ్శబ్దం )

పిచ్చ : వీళ్ళు శుద్ధ రౌడీలు బాబూ!

సంజీ : ఆఁ! ఏమంటావ్? రౌడీలా! ఐతే అయ్యార్లే! ఎలక్షన్లో అలాంటివాళ్ళే బాగా పనికొస్తారు.

పిచ్చ : పచ్చి మోసగాళ్ళు.........

సంజీ : అలాంటివాళ్ళే వుండాలి.

పిచ్చ : అదికాదుబాబూ! వీళ్ళు ఏదో కుట్రపన్నినట్టు కనిపిస్తోంది.

సంజీ : ఏం కుట్ర?

పిచ్చ : అదే అర్థం కావడంలేదు బాబూ! ఇందాకటినుంచీ ప్లీడరు బాబుతో చాలనేపు గుసగుసలు రుసరుసలు జరిపేరు.

సంజీ : ఆఁ! అలాగా!

పిచ్చ : ఔను బాబూ!

సంజీ : ఏం మాట్లాడేరో తెలుసా?

పిచ్చ : ఏమో బాబూ! నాకు సరిగ్గా తెలీదు. చూసివస్తా నుండండి.

(పిచ్చయ్య గబగబా వెళతాడు. డాక్టరు దీర్ఘంగా ఆలో చిస్తుంటాడు. రెండుక్షణాలు నిశ్శబ్దం. రాధాకృష్ణ వస్తాడు. చాలా నిరాడంబరజీవి.)

రాధా : నమస్కారం డాక్టరుగారూ!

సంజీ : ఓ, రాధాకృష్ణగారా! నమస్కారం. రండి, కూర్చోండి.

రాధా : (కూర్చుంటూ) ఒక మాట అడగాలని వచ్చాను.

సంజీ : ఏమిటది ?

రాధా : మీరు మరోలా భావించకూడదు.

సంజీ : పరవాలేదు. చెప్పండి.

రాధా : మీరు యెన్నికల్లో నిలబడాలనుకుంటున్నారట! నిజమా ?

సంజీ : (ముక్తసరిగా) ఔను.

రాధా : క్షమించండి. అడిగేనని అనుకోవద్దు. మీరు మన స్ఫూర్తిగా నిలబడదలచుకున్నారా ?

సంజీ : ఎందుకిలా అడుగుతున్నారు ?

రాధా : నిన్న మనం కలుసుకున్నప్పుడుకూడ ఈ విషయం నాకు చెప్పలేదేమా అని!

సంజీ : నిన్న నాకీ ఉద్దేశంలేదు. ఇవ్వాళే—ఇప్పుడే నాకా అభిప్రాయం కలిగింది.

రాధా : అయితే నేను విరమించుకుంటాను.

సంజీ : (ఆశ్చర్యంగా) మీరూ నిలబడుతున్నారా ?

రాధా : ఔను. నిలబడాలనే ప్రయత్నాలు చేశాను. కాని మీరు నిలబడితే నేను పోటీ చెయ్యదలచుకోలేదు.

సంజీ : నాకోసం మీరెందుకు మానేస్తారు ?

రాధా : మనలో మనం పోటీలుపడి, తగాదాలు పెట్టుకోడ మెందుకు, డాక్టరుగారూ! ఎవరో ఒకరు యోగ్యులు నిలబడి, పోటీలేకుండా ఎన్నికవడం మంచిది.

సంజీ : కాని జ్ఞానేశ్వరావు పోటీచేస్తున్నాడుగా !

రాధా : ఇప్పుడే ఆయన్ని కలుసుకొని, మీదగ్గర కొచ్చాను. మీరు నిలబడుతున్నారనే ఆయన పోటీచెయ్యదలచు కున్నారట !

సంజీ : కాదు అతను నిలబడుతున్నాడనే నేను పోటీ చెయ్య దలచుకున్నాను.

రాధా : అక్కడే మీయిద్దరకు భేదాభిప్రాయాలు వచ్చాయి. ఆయన నిలబడదలచుకున్నాడని మీరు, మీరు నిల బడ దలచుకున్నారని ఆయన, పోటీచెయ్యా లను కున్నారు. కాని మీ భేదాభిప్రాయాలకు ముఖ్య కారకు లెవరో తెలుసా ?

సంజీ : ఎవరు ?

రాధా : ఎల్లయ్యా, పుల్లయ్యాను.

సంజీ : ఆఁ !

రాధా : నిజం. మీరిద్దరు నా మిత్రులే. మీలో ఎవరు నిలబడి ఎన్నికైనా నాకు సంతోషమే. కాని ఈ ఎన్నికల మూలంగా మనస్పర్థలు పొంచుకోడం నాకిష్టంలేదు.

సంజీ : కాని... ... ...

రాధా : నేనుచెప్పేది పూర్తిగా వినండి. ఇంతక్రితమే మీ రిద్దరు ఎంతో అన్యోన్యంగా, నిష్కల్మషంగా మాట్లాడుకున్నారు. ఔనా ?

సంజీ : ఔను.

రాధా : అప్పటికి మీలో ఎవరికీ ఈ ఎన్నికల గొడవే తెలియదు.

సంజీ : అతనికి తెలుసు.

రాధా : క్షమించండి. అక్కడే పొరపాటు పడుతున్నారు. ఆయనకూ తెలియదు, మీకూ తెలియదు. కాని, ఎల్లయ్యా పుల్లయ్యాలు వచ్చి ఆయనదగ్గర మీరు నిలబడుతున్నట్టు, మీదగ్గర ఆయన నిలబడుతున్నట్టు, పెద్ద నాటకమాడారు.

సంజీ : (ఆశ్చర్యంగా) ఆఁ! నిజమా ?

రాధా : ఔను. అలా చెప్పి ఆయనదగ్గర నాలుగువందలు, మీదగ్గర ఆరువందలు కాజేశారు.

సంజీ : మీకెలా తెలుసు ?

రాధా : చూడండి, ఈ నోట్లు మీ రిచ్చినవేనా ?

( జేబులోంచి తీసి యిస్తాడు. )

సంజీ : ఔను. వీటిమీద నా సంతకాలుకూడా వున్నాయి.

రాధా : ఆ ఎల్లయ్యా, పుల్లయ్యాలు అప్పుడప్పుడు మా కార్యాలయానికి వస్తుంటారు. వాళ్ళసంగతి నాకు బాగా తెలుసు. ఈ నాటకమాడి, మా కార్యాలయంలో కూర్చుని, నేను లేననుకుని, పంచుకుంటూ గొడవ

పడ్డారు. ఆ గొడవలో అన్ని విషయాలు అడక్కుండా వాటంతటవే బైటపడ్డాయి.

సంజీ: అలాగా!

రాధా: వాళ్ళను కట్టి మా కార్యాలయంలో వుంచాను. పిచ్చయ్య తీసుకొస్తాడు, చూద్దురుగాని.

(ఇంతలో జ్ఞానేశ్వర్రావు వస్తాడు.)

జ్ఞానే: (సంజీవరావు చేతులు పట్టుకుని) సంజీవ్! చాల పొరపాటుచేశాను. అనవసరంగా వాళ్ళమాటలు విని నిన్ను కొట్టాను. నన్ను క్షమించరా, సంజీవ్!

సంజీ: (మాట్లాడడు.)

జ్ఞానే: (సంజీవరావు చేతులతో తన చెంపలు గట్టిగా కొట్టుకుంటూ) క్షమించవా? క్షమించవా? (యింకా గట్టిగా కొట్టుకుంటూ) క్షమించవా? క్షమించవా?

సంజీ: (అకస్మాత్తుగా లేచి జ్ఞానేశ్వర్రావును గట్టిగా కౌగిలించుకుని) జ్ఞానూ!

జ్ఞానే: సంజీవ్!

సంజీ: మనం కొట్టుకోడం, తిట్టుకోడం మానేసి చాల రోజులయింది. ఇవ్వాళ నువ్వు కొట్టేసరికి చిన్నతనం జ్ఞాపకం వచ్చింది. చిన్నప్పుడు ఓర్చుకునేవాడిని. కాని యిప్పుడు ఓర్చుకోలేకపోయాను.

జ్ఞానే: నన్ను క్షమించేనను.

సంజీ: ఎందుకురా క్షమించడం? ఇద్దరివల్లా పొరపాటు జరిగింది. నువ్వు నన్ను కొట్టి వూరుకున్నావ్. కాని

నిన్ను నేను చాలా తిట్టాను. (ఆగి) కూర్చో.
అయినా మధ్యమధ్య యిలాంటి సంఘటన లుంటేనే
మనస్నేహం దృఢపడుతుంది.

రాధా : ఇంతవరకు అయింది చాలు.

(పిచ్చయ్య ఎల్లయ్యను, పుల్లయ్యను త్రాళ్ళతో కట్టి తీసుకువస్తాడు.)

పిచ్చ : ఇదో, జరిగేది చూడండి.

(అంటూ ఎల్లయ్య బుర్రను పుల్లయ్యబుర్రకు గట్టిగా ఢీ కొడతాడు.)

ఎల్ల : చచ్చానోయ్, పుల్లయ్యా!
పుల్ల : నెమ్మదిగా కొట్టరా, పిచ్చయ్యా!
పిచ్చ : ప్రాణాలు పోవు బాబయ్యా!
ఎల్ల : నీకు దణ్ణం పెడతాంరా.
పుల్ల : నీకు సలాంచేస్తాంరా.
పిచ్చ : నాకెందుకు బాబయ్యా? మీ బాబుకు పెట్టండి బాబయ్యా! వచ్చి మిమ్మల్ని రక్షిస్తాడు బాబయ్యా!

(అంటూ యింకా గట్టిగా కొడతాడు.)

ఎల్ల : అమ్మోయ్, ఆగరా.
పుల్ల : బాబోయ్, వుండరా.

(పిచ్చయ్య కొడుతూనే వుంటాడు.)

ఎల్ల : (తప్పించుకుని జ్ఞానేశ్వరావు కాళ్లమీదపడి) ప్లీడరు బాబూ! క్షమించండి.

ఫుల్ల : (సంజీవరావు కాళ్ళమీద పడి) డాక్టరు బాబూ! రక్షించండి.

ఎల్ల : ఇంకెప్పుడూ చెయ్యం.

ఫుల్ల : చెంపదెబ్బలు వేసుకుంటాం.

(పిచ్చయ్య మళ్ళీ పట్టుకొని కొడతాడు.)

పిచ్చ : సన్యాసులు. చీడపురుగులు. పచ్చటి స్నేహంలో చిచ్చుపెట్టా లనుకున్నారు.

సంజీ : పిచ్చయ్యా! వాళ్ళనేమీ చెయ్యకు.

జ్ఞానే : వాళ్ళపని నేను చూస్తాను. తీసుకెళ్ళి బైట స్తంభానికి కట్టిపెట్టు.

ఎల్ల : క్షమించాలి బాబూ! పొరపాటు జరిగింది.

ఫుల్ల : మన్నించాలి తండ్రీ! గ్రహపాటుకొద్దీ అయింది.

జ్ఞానే : (గట్టిగా) పిచ్చయ్యా! తీసుకెళ్ళు.

పిచ్చ : (కొడుతూ) పదండి.

(లాక్కెళుతుంటాడు.)

ఎల్ల : (ఏడుపుముఖంతో) ఫుల్లయ్యా!

ఫుల్ల : (ఏడుస్తూ) మరే ఎల్లయ్యా!

ఎల్ల : ఎల్లయ్య ఎలుకైపోయాడయ్యా!

ఫుల్ల : ఫుల్లయ్య పిల్లిగా మారిపోయాడయ్యా!

(ఇద్దరు ఏడుస్తుంటే పిచ్చయ్య లాక్కెడతాడు.)

సంజీ : ఒరే జ్ఞానేశ్వర్! మన రాధాకృష్ణగారు నిలబడుతున్నారట!

రాధా : మీ యిద్దరిలో యెవరైనా నిలబడితేమాత్రం నేను పోటీచెయ్యను.

సంజీ : మా కెందుకండీ, ఈ ఎన్నికలు ? మా పనులతోనే మాకు సరిపోతుంది.

జ్ఞానే : సరిగ్గా భోజనం చెయ్యడానికే ఖాళీవుండదు.

సంజీ : మీరు నిలబడండి.

జ్ఞానే : మేమిద్దరం విరమించుకున్నట్టే.

సంజీ : మేముకూడ సహాయంచేస్తాం.

జ్ఞానే : సాధ్యమైనంతవరకు మరెవరూ పోటీ లేకుండా చూస్తాం.

( పిచ్చయ్య వస్తాడు. )

పిచ్చ : ( జ్ఞానేశ్వరావుతో ) వీరికోసం ఎవరో వచ్చారు బాబూ !

జ్ఞానే : ఇప్పుడు తీరికలేదని చెప్పు. మళ్ళీరమ్మను.

పిచ్చ : మొన్న ఖూనీకేసుతాలూకు మనుషులట ! చాల అవసరమైన పనుందట బాబూ !

జ్ఞానే : సరే, బైట వుండమను, వస్తాను.

( పిచ్చయ్య వెళ్ళిపోతాడు. )

సంజీ : చూడండి రాధాకృష్ణగారూ ! వీడికి తలమొయ్యా కేసులున్నాయి; ఊపిరి పీల్చుకోడానికి కూడ తీరికుండదు. (కొంటెగా) పైగా యెన్నికల్లో నిలబడతాడట !—ఎన్నికల్లో.

( జ్ఞానేశ్వరావు తల వంచుకొంటాడు. పిచ్చయ్య వస్తాడు. )

పిచ్చ : (సంజీవరావుతో) బాబూ! కనకరత్నంగారికి చాల ప్రమాదంగావుందట! మిమ్మల్ని త్వరగా రమ్మంటు న్నారు.

సంజీ : వస్తాను, నువ్వు బాక్సు తీసుకెళ్ళు.

పిచ్చ : ఆయన కొడుకు వచ్చాడు బాబూ!

సంజీ : వస్తున్నా, పద.

( పిచ్చయ్య వెళ్ళిపోతాడు. )

జ్ఞానే : చూడండి, రాధాకృష్ణగారూ! పీడికి యిరవై నాలుగ్గంటలు రోగులతోనే సరిపోతుంది. తిండి తినడానికికూడ తీరికుండదు. పైగా ఎన్నికల్లో పోటీ చేస్తాడట!—ఎన్నికల్లో.

( ముగ్గురు నవ్వుకొంటారు. )

సంజీ : ( నవ్వుతూ ) ఏడిశావ్! నిలబడమంటావా?

జ్ఞానే : అదే నేనూ అంటున్నా.

రాధా : మీ యిద్దరిలో ఎవరో ఒకరు నిలబడి నా బరువు తగ్గించండి.

సంజీ : మాకెందుకు రాధాకృష్ణగారూ! వాడిపని వాడికుంది; నాపని నాకుంది.

జ్ఞానే : మాపనులకే టైము చాలడంలేదు. అదికూడ ఎందుకండీ!

సంజీ : మీరు నిలబడండి. సామాన్యంగా యింకెవరూ పోటీ చెయ్యరు.

జ్ఞానే: మీరుచేసిన దేశసేవ, సంఘసేవ, మనవూళ్ళో యిం కెవరు చేశారు?

సంజీ: మీరు తప్పకుండా గెలుస్తారు.

రాధా: ధన్యవాదాలు.

సంజీ: మీకే మేం ధన్యవాదా లర్పించాలి. మా స్నేహం చెడకుండా కాపాడారు.

జ్ఞానే: మీ విజయానికి మేం అన్నివిధాల ప్రయత్నిస్తాం.

రాధా: ధన్యవాదాలు చెప్పకుండా వుండలేను.

( పిచ్చయ్య వస్తాడు. )

పిచ్చ: (సంజీవరావుతో) త్వరగా రండి బాబూ! చాల ప్రమాదంగా వుందిట.

సంజీ: వస్తున్నా; నడు. (పిచ్చయ్య వెళ్ళిపోతాడు.) క్షమించాలి, రాధాకృష్ణగారూ! కాఫీ అయినా యివ్వడానికి తీరికలేదు.

రాధా: పరవాలేదు.

జ్ఞానే: పరవాలేకపోవడమేం? ప్రొద్దుట కోర్టు కెళ్ళేటప్పుడు రాధాకృష్ణగార్ని తీసుకొస్తాలే. మంచి టిఫెన్ చేయించు.

సంజీ: తప్పకుండా తీసుకురా.

రాధా: ( ఇద్దరకు నమస్కరిస్తూ ) మీకూ, నాకూ కూడ చాల పనులున్నాయి వస్తాను. తర్వాత మళ్ళీ కలుసుకుంటాను.

సంజీ :
జ్ఞానే : } (నమస్కరిస్తూ) నమస్తే.

(రాధాకృష్ణ వెళ్ళిపోతాడు)

జ్ఞానే : పద, మనం వెళదాం.

సంజీ : నడు.

(ఒకరి చెయ్యి మరొకరు పట్టుకొని, వూపుకొంటూ
వెళుతుండగా—తెర.)



45

# నేటి విద్యార్థి

(ఏకాంక నాటిక)

—• పాత్రలు •—

సత్యమూర్తి }
మహీధర్ } కాలేజీ విద్యార్థులు
గోపాలరాజు }

సాధూబాబా : (మహీధర్ తండ్రి)

[ చిన్న గది చూడ్డానికి రెండు భాగాల్లా కన్పిస్తోంది.

కుడివైపు భాగంలో కుర్చీ, టేబుల్, ట్రంకేస్, ఇంకా కొన్ని సామాన్యవస్తువులు వున్నాయి. సత్యమూర్తి నలిగిన బట్టలతో, అలసిన ముఖంతో కుర్చీలో కూర్చుని దీర్ఘంగా చదువుతుంటాడు. ఆ భాగంలో అందంగావుండే వస్తువులుగాని, విలువైన సామాగ్రిగాని—ఏమీ లేవు. టేబుల్ ప్రక్క చిన్న సూట్ కేస్ వుంది. టేబుల్ మీద, క్రింద చాల పుస్తకాలున్నాయి.

ఎడమవైపు భాగంలో అందమైన వస్తువులు చక్కగా అమర్చబడి వున్నాయి. కొన్ని కేలండర్లు, రంగు రంగు చిత్రాలు, సినీ నటీనటుల ఫోటోలు, అక్కడక్కడ అమర్చబడి వున్నాయి. మహీధర్ అట్టహాసంగా అలంకరించుకుని, టేబుల్ మీదనున్న పెద్ద అద్దంలో చూసుకుంటూ పాడుతుంటాడు. ]

మహీధర్ : (పాట)

మధురం! మధురం !
మధురాతి మధురం !!

విశాల విశ్వ విహారం,
రక రకాల అనుభవం,
స్వేచ్ఛానంద జీవితం !

మధురం ! మధురం !
మధురాతి మధురం !!

పుష్టిగాను భోజనం,
సృష్టిలోని సౌందర్యం,
అనుభవించె జీవితం ! ॥మ॥

( ఇంగ్లీషు ట్యూనులో పాడుతూ, పాటకు తగినట్లు అడుగుకూడ వేస్తుంటాడు )

సత్యమూర్తి : అబ్బా ! కాస్సేపు ఆపరా నీ పాట ! చెవులు చిల్లులుపడి చస్తున్నాను.

మహీ : చావు. ఈ చదువు చదివేకంటే చావడమే మంచిది. అసలు బ్రతకడమే చావుకోసం.

మూర్తి : నీ వేదాంతం చాలించు. పరీక్షలు దగ్గర కొచ్చాయ్; కొంచెం చదువుకోనియ్. (చదువు తుంటాడు.)

మహీ : పరీక్షలు ! పరీక్షలు !! లోకంలోని ఆనందాన్ని అనుభవించనివ్వకుండా, ఈ పరీక్ష లోక పెద్ద ప్రళయంలా వచ్చి పడుతుంటాయ్. ప్రతి

కున్నంతకాలం ఈ పరీక్షల్లోపడి కొట్టుకుంటుంటే, జీవితంలోని సుఖాన్ని, ప్రపంచంలోని ఆనందాన్ని దాన్ని ఎప్పుడనుభవించేది ?

( గోపాలరాజు వస్తాడు )

రాజు : (చప్పట్లు కొడుతూ) హియర్, హియర్ !

మూర్తి : ( మాట్లాడకుండా చదువుతుంటాడు. )

మహీం : వెరీగుడ్. వచ్చేవ్‌రా, రాజూ ! రా, సమయానికి వచ్చావ్.

రాజు : Delays are dangerous అన్నట్టు ఆలస్యం దేనికి ? టైమంటే, టైమే.

మహీం : వెరీగుడ్. (సత్యమూర్తివంక చూచి) నాన్‌సెన్స్ ! వీడు చూడరా !

రాజు : పుస్తకాల పురుగు.

మహీం : నీకేరా సత్యమూర్తీ, చెప్పేది. ఎప్పుడుచూసినా పుస్తకాలు, చదువు, పరీక్షలు తప్ప, యింతపెద్ద ప్రపంచంలో... ... ...

రాజు : రెండువందల ఏభైకోట్లమంది స్త్రీ పురుషులు, జీవితంలోని ఆనందపు లోతుల్ని వ్రేళ్ళతోసహా పైకిలాగి, హాయిగా అనుభవిస్తూ, స్వేచ్ఛగా బ్రతుకుతున్న ఈ విశాల విశ్వంలో... ... ...

మహీం : కాస్త భాగంపంచుకోవాలనే కోరికలేదేమిరానీకు!

రాజు : నలుగురిలోను నవ్వుముఖంతో తిరగాలనే తలంపు లేదేమిరా ?

మూర్తి : (తల వంచుకుని చదువుతుంటాడు.)
మహీ : ఏం రా? (గట్టిగా) నీకేరా చెప్పేది.
మూర్తి : (విసుగ్గా) అబ్బా, వుండరా.
మహీ : ఆ పుస్తకాన్ని కొంచెం ప్రక్కకు పారేయ్. ఎప్పుడుచూసినా చదువే. నీ చదువు చూస్తుంటే, నాబుర్ర గిర్రున తిరుగుతోంది.
రాజు : నా బుర్రె చెడిపోతోంది.
మూర్తి : ఈ వెధవకబుర్లు చెబుతూ కాలక్షేపం చేసేకంటే, కాస్త మీరూ చదవకూడదూ ?
మహీ : కాస్తేమిఖర్మం? కావలసినంత చదువుతున్నాం. మేము చదివేది, నువ్వుచదివే పుస్తకాల్లో ఏ మూల వెదికినా కనిపించదు......
రాజు : మేము అర్థం చేసుకున్న విజ్ఞానం లెక్చరర్ల ఉపన్యాసాలకు అతీతమై ఎన్నోవందల అడుగుల ఉన్నతస్థాయిలో వుంది.
మూర్తి : అబ్బ! మీ లెక్చర్లు ఆపుజేసి నన్నయినా చదువుకోనివ్వండిరా. పరీక్షలు దగ్గరకొచ్చాయ్.
మహీ : పరీక్షలు కావురా జీవితానికి ముఖ్యం!— పలువిధాలైన మనుషుల మనస్తత్వాల్ని గ్రహించడం అవసరం. విభిన్న దృక్పథాల్లో, రకరకాల వినోద విజ్ఞానాలతో సమ్మిళితమై, నిగూఢ రహస్యాలతో అగమ్యగోచరంగావుండే, ఈ ప్రపంచాన్ని పరిపూర్ణంగా అర్థంచేసుకోడం జీవితానికి ముఖ్యం.

రాజు : ప్రపంచమంటే ఏమనుకున్నావ్ ?
మహీం : ఆద్యంతాలులేని మహాకావ్యం.
రాజు : జీవితమంతా చదివినా తరగని ఒక పెద్ద గ్రంథం.
మూర్తి : (కోపంగా) ప్రపంచం ఆద్యంత్యాలులేని మహా కావ్యం ! జీవితం విరామంలేకుండా అనుభవించ వలసిన ఆనందసాగరం ! హుఁ ! ఇటువంటి పిచ్చి పిచ్చి ఆలోచనలుతప్ప మచ్చుకు ఒక్క అక్షరం ముక్కైనా ముట్టుకోరు.
రాజు : అక్షరం ముక్కల్తో మోక్షం లభించేరోజులు పోయాయి. ఇప్పుడు ఎక్కడచూచినా బియ్యేలు, యం. యేలు కుప్పలు కుప్పలుగా వున్నారు ...
మహీం : అందుచేత, కమ్మగా జీవితం గడవాలంటే; మహాకావ్యంలోని మర్మాన్ని ముక్కలుముక్క లుగా విడదీసి, చక్కగా అర్థంచేసుకోవాలి. ఆ మహాకావ్యమే ఈ ప్రపంచం.
రాజు : అంతర్నేత్రాలుంటే, ఆ మూలాగ్రంగా ఈ ఈ మహత్తర గ్రంథాన్ని పఠించు.
మహీం : తెలివితేటలుంటే ఆద్యంతాల మధ్యలోని అన్ని విషయాల్ని పరిశీలించు.
రాజు : ( సత్యమూర్తి బుజంతట్టి ) వింటున్నావా ?
మూర్తి : ( మాట్లాడకుండా చదువుతుంటాడు )
మహీం : ( అటు యిటు తిరుగుతూ ) జీవితపు లోతుల్ని, లోకంలోని మర్మాన్ని తెలుసుకొని, యుక్తిగా శక్తిని వినియోగించుకొంటూ, కాలాన్ని అనుస

రించి, అవసరాన్నిబట్టి, ఆనందాన్ని అనుభవించు.

రాజు : జీవితాన్ని సార్థకంచేసుకో.

మహీం : మనకు ఆది-అంతాలతో పనిలేదు. మన తల్లిదండ్రులు చేసిన పుణ్యానికి ఫలితంగా ఎప్పుడో పుట్టాం.

రాజు : మనవంటివాళ్ళు పుట్టకపోతే ఈ భూదేవి గొల్లున గోలపెడుతుంది.

మహీం : అందుచేత మనం పుట్టడం మంచిదే.

రాజు : అక్షరాల.

మహీం : ఇహ, ఎప్పుడో చచ్చిపోతాం.

రాజు : దానికి యిప్పటినుంచే ఆలోచించడం అనవసరం.

మహీం : మనకు కావలసింది — ఆద్యంతాలమధ్యనుండే ఆనందం.

రాజు : తళతళ మెరుస్తూ, ముసుగులోంచి తొంగిచూసే ముత్యాలహారంలాంటి నిత్యానంద జీవితం.

మహీం : ( రాగంతీస్తూ ) జీవితం ! జీవితం ! నిత్యానంద జీవితం ! సత్యానికి అతీతం ! అతీతం ! అతీతం !

రాజు : వింటున్నావా? ఏంరా? (మూర్తి చదువుతుండటం చూసి, కోపంతో అతని చేతిలోని పుస్తకాన్ని లాక్కొని, బైట పారేసి ) నాన్‌సెన్స్ ! ఎప్పుడు చూసినా పుస్తకాల్తో బుర్ర బ్రద్దలు కొట్టుకుంటూ, నీ అమూల్యమైన మస్తిష్కాన్ని మట్టిపాలు చేసుకుంటున్నావ్.

మహీం : రాను రాను కామన్ సెన్స్ లేకుండా డామిట్‌లా తయారవుతున్నావ్.

మూర్తి : ఎందుకురా, మీకంతకోపం ? (లేచి పుస్తకం తెచ్చుకుంటాడు.)

మహీం : నువ్వు మా స్నేహితుడవు కనుక ... ...

రాజు : Reprove thy friend privately, commend him publicly. అన్నట్టు ఏదో వెనకాల కాస్త మందలించినా, నలుగురిలోను పొగుడుతూనే వుంటాం. మరొకరైతేనా ? ... ... ...

మహీం : ఆఁ ! నువ్వు—అంటే, శరీరాలు వేరైనా, స్నేహమనే బంధంలో గట్టిగా కట్టుబడి, ఈ విశాల విశ్వంలోని నిశ్చితానిశ్చితాలకు తావివ్వని ప్రియ మిత్రుడవని క్షమించి వూరుకున్నాం. లేకపోతే, మేమింత సేపు చర్చించిన ... ... ...

రాజు : విశ్వమానవ చరిత్రలో స్వర్ణాక్షరాలతో పెద్ద శీర్షిక పెట్టి వ్రాయవలసిన, అమోఘమైన ఉపన్యాసాన్ని నిర్లక్ష్యంతో వినకుండా వూరుకుంటే, ప్రాణమాత్రుల్నే కాదు — జీవంలేని వస్తువుల్ని కూడ క్షమించలేం.

మహీం : సర్లెస్లి.

మూర్తి : ఇన్నికబుర్లు చెప్పేకంటే, కలంపట్టుకుని, నాలుగు మాటలు కాగితంమీద రాయకూడదూ ?

రాజు : నాలుగుముక్కలు రాయడం వస్తే, నలభై మార్కులు ఈజీగా . సంపాదిస్తాం. అదిరాకే యిన్ని తిప్పలు.

మూర్తి : కనీసం హెడ్డింగులైనా చూడండి, లేకపోతే రేపు పరీక్షల్లో ప్రపంచమే తలక్రిందులుగా కనిపిస్తుంది.

మహీం : Dont Worry. ప్రపంచమే తల్లక్రిందులైతే, మనం పరీక్షలురాసి, పాసై చేసేదేముంది ?

రాజు : నిరుద్యోగ సమస్య ఎక్కువగా ప్రబలిపోయిన ఈరోజుల్లో, మనమంతా కష్టపడి చదివి, పాసైనా ఉద్యోగాలు దొరికేది మహాకష్టం.

మహీం : అందుచేత మనం పరీక్షలు రాయకపోయినా అంత ప్రమాదంలేదు.

మూర్తి : చదవకుండ, పరీక్షలు రాయకుండ, యిహ మీరు యిక్కడుండి ఏంచెయ్యాలి ? పోయి, గాడిదలు కాసుకోండి.

రాజు : గాడిదలు కాద్దామన్నా, మనల్ని చూస్తేనే అవి పారిపోతాయి.

మహీం : ఛా, ఛా, ఛా! అసలు పరీక్షలనే ఈ ప్రళయం లేకుంటే ఎంత బాగుండేది !

రాజు : ఎంతైనా బాగుండేది.

మహీం : అదీగాక, మనలాంటి ప్రపంచ పరిజ్ఞానంగల మహావ్యక్తుల్ని, అనుభవజ్ఞుల్ని, ఈ పరీక్షల పరిమితజ్ఞానంలో బంధించడం ఎంత మూర్ఖత్వం ! ఎంత ఫ్యూలిష్ నెస్ !

రాజు : సర్టెన్లీ.

మూర్తి : ఒరే బాబూ ! మీకు వంద నమస్కారాలు చేస్తాను; బైటకువెళ్ళి మాట్లాడుకోండి.

మహీ : పొమ్మంటావా ?

మూర్తి : మాట్లాడకుండా చదువుకుంటే మరీమంచిది.

మహీ : ఇప్పుడు చదవదలచుకోలేదు.

రాజు : పొమ్మంటే పోతాం.

మూర్తి : ప్లీజ్ ... ... ...

రాజు : పదరా మహీధర్ పోదాం.

మహీ : పద. ( రెండడుగులు వేసి ) ఒరే సత్యమూర్తీ ! ఒక్క ఐదురూపాయలుంటే యివ్వరా.

మూర్తి : నాదగ్గర ఐదుదమ్మిడీలుకూడ లేవు.

రాజు : దమ్మిడీలు వున్నా వద్దు.

మహీ : ఉంటాయి, చూడు. సాయంత్రం యిస్తాం.

మూర్తి : ఇప్పుడులేనిడబ్బు సాయంత్రంమాత్రంఎలావస్తుంది?

మహీ : అదే మనలో వుండే స్పెషాలిటీ !

రాజు : ఈ గంటలో గరీబ్, మరొక గంటలో నవాబ్ !

మహీ : మనం తలచుకోవాలిగాని, ఆకాశానికి చిల్లుపెట్టి రోకటిధారలా డబ్బును 'గల-గల' కురిపించం ?

రాజు : ఇప్పుడే టెలిగ్రాం యిచ్చాం.

మూర్తి : ఎవరికి ?

రాజు : ఇంటికి.

మూర్తి : ఏమని ?

రాజు : Pocket empty, send fifty.

మహీం : ఇంకో రెండుగంటల్లో T. M. O. వస్తుంది.

రాజు : రాగానే నీ డబ్బు నీ కిచ్చేస్తాం.

మూర్తి : నా దగ్గర చిల్లిగవ్వలేదు, అదీగాక ఐదురూపాయ లెందుకు ?

మహీం : ఎందు కేమిటి? — అర్థంలేనిప్రశ్న. డబ్బెందుకు ? ఖర్చు చేసుకోడానికి. హాయిగా ఆనందాన్ని కొనుక్కోడానికి.

మూర్తి : దమ్మిడీ సంపాదించడం చేతకాదుగాని రూపాయలు ఖర్చుపెట్టడం బాగా తెలుసు.

మహీం : ఇన్సల్ట్ ! సంపాదించడం చేతకాకపోవడమేమిటి ? సినిమా సెంటరులో నలుగురు విద్యార్థుల ముందు ప్రస్తుత విద్యార్థుల ఆర్థికపరిస్థితుల్ని గురించి చిన్న ఉపన్యాస మిస్తే, ఎవడో ఒకడు అరకప్పు టీ పోయిస్తాడు ... ...

రాజు : కాఫీహోటల్లో కాస్సేపు లోకం పోకడను, ప్రభుత్వ ప్రణాళికల్ని విమర్శిస్తే, ఏ ఉదార పురుషుడో ఒక సిగరెట్టు పారేస్తాడు.

మహీం : ఇదంతా సంపాదనకాదూ ?

మూర్తి : ఎలాగో ఏడవండి. నా దగ్గరమాత్రం ఏంలేదు. ఉన్నంతకాలం మీకే యిచ్చాను. ( చదువుతుంటాడు. )

రాజు : నాన్ సెన్స్. డబ్బుకోసం యింత నిర్మొహమాటంగా మాట్లాడ్డం మన స్నేహానికే కళంకం.

మహీం : వెధవ డబ్బు! ఇండియాలో రోజుకు ఎన్ని కోట్ల రూపాయిలు ఒకళ్ళ చేతిల్లోంచి మరొకళ్ళ చేతిలోకి ప్రయాణం చెయ్యడంలేదు ? మనకు ఐదు రూపాయిలే దొరకవా ? పదరా రాజూ ! ఎక్కడో చూద్దాం.

( బైటకు వెళ్ళడానికి సిద్ధమౌతారు. ఇంతలో బైటనుంచి 'పత్రిక-పత్రిక' అని కేకవేసి పత్రికవాడు ఒక పేపరు లోపల వేస్తాడు. )

మహీం : ఉండరా బ్రదర్ ! వారఫలాల్లో మన స్టార్ ఎలావుందో చూసిపోదాం.

( పత్రిక తీస్తాడు )

రాజు : గట్టిగా చదువు, నేనూ వింటాను.

మహీం : (చదువుతాడు) గత రెండు మూడు వారాల్లో మీ మనస్సును వేధిస్తున్న చిక్కులు ఈ వారంలో తొలగిపోతాయి ...

రాజు : బాకీలుతప్ప మనకేమీ చిక్కులులేవు. ఇవి తప్పాలంటే T. M. O. రావాలి. ఈ వారఫలితాల్నిబట్టి చూస్తే T. M. O. వచ్చేటట్లే వుంది.

మూర్తి : వచ్చే వుంటుంది. వెళ్ళి పోస్టాఫీసు దగ్గర కూర్చోండి.

మహీం : ( చదువుతూ ) దారీ - తెన్నూ లేని మీ ఆలోచనలకు ఒక ఆలంబన, ఆధారం లభిస్తుంది.... ...

రాజు : వెరీగుడ్ ! అయితే, మనం చదవకుండానే సర్టిఫికేట్ కొట్టేస్తాం; అడక్కుండానే ఉద్యోగం పట్టేస్తాం.

మూర్తి : (హేళనగా) ఆఁ! ఆఁ! రిజష్టరులోంచి పేరు కొట్టేస్తే, యింటిదారి పట్టేస్తాం.

రాజు : నువ్వు నోరుముయ్ రా.

మహీం : (చదువుతూ) డబ్బు రాబడి కొంచెం ఎక్కువగానే వుంటుంది.

మూర్తి : (హేళనగా) ఉంటుందుంటుంది. నాలుగు జేబులు ఎక్కువ పెట్టించుకోండి.

మహీం : (చదువుతూ) అనుకోకుండానే కొంత పెద్ద మొత్తం అకస్మాత్తుగా చేతికి వచ్చే సూచనలు కన్పిస్తున్నాయి.

రాజు : థేఁక్స్యూ! ఐతే మొన్న వేసిన Square Words పజిల్లో ఫస్ట్ ప్రైజ్ తప్పనిసరిగా వస్తుంది.

మహీం : ఏడు, ఎనిమిది తారీకుల్లో శుభవార్త......

రాజు : ఐతే, నిజంగా Square Words లో ప్రైజ్ కొట్టేశామన్నమాటే !

మహీం : విద్యార్థులకు అన్నివిషయాల్లోను విజయమే !

రాజు : God bless you. పరీక్షల్లో ప్యాస్ ష్యూర్, పజిల్లో ప్రైజ్ ష్యూర్. (గట్టిగా) గన్ ష్యూర్.

మూర్తి : హుఁ! గన్ ష్యూర్ ! పరీక్షపోవడం ష్యూర్, పరీక్షకుకట్టిన డబ్బు క్షౌరమవడం గన్ ష్యూర్.

పజిల్‌కు కట్టిన డబ్బులో పైసాకూడా లేకుండా-పోవడం గన్‌షుర్యాక్.

మహీ : నోరు ముయ్.

రాజు : షట్ అప్.

మూర్తి : (కోపంగా) యూ షటప్. ఎవర్నిరా మీరు బెదిరించేది? ఇందాకటినుంచి చూస్తున్నాను, మీరు చదువుకోరు, నన్ను చదువుకోనివ్వరు.

మహీ : మనం ఆ 'చదువు' అనే శబ్దాన్ని — అంటే, స్టడీస్ అనే వర్డ్‌ను మన లైఫ్ - డిక్షనరీలోంచి తీసి బైటపారేశాం.

మూర్తి : అయితే బైటకుపోయి గప్పాలు కొడుతూ, గాడిదలు కాయండి.

రాజు : గాడిదల్ని కాద్దామన్నా, మనల్ని చూస్తేనే పారిపోతాయని ముందే చెప్పానుగా!

మహీ : మేము సామాన్యమైనవాళ్ళం కాదు. ఇంతకాలమున్నా యింకా నీకు తెలియదేమో!

మూర్తి : తెలియకేం? — బాగా తెలుసు.

రాజు : ఏం తెలుసు?

మూర్తి : అనవసరంగా వీధులవెంట తిరిగే వెర్రిబాగులవాళ్ళని.

మహీ : నాన్‌సెన్స్. నీకింకా తెలీదు. సంఘంలోని దుమ్ము దులిపి వెల్లవేస్తాం. తరతరాలనుంచి వస్తున్న అవకతవక వ్యవహారాల్ని అరికట్టి,

సువర్ణమయ స్వర్గసామ్రాజ్యానికి పునాదులు వేసి సౌధాల్ని నిర్మిస్తాం.

రాజు : సంఘంలోని దుమ్మును, దురాచారాల్ని సన్నని గ్లాస్కో గుడ్డతో వడకట్టి, సంస్కరిస్తాం.

మూర్తి : ఔనౌను. మాటల్లు కోటలు దాటతాయ్; కాని కాలుమాత్రం గడపదాటదు.

మహీ : అలాగే చూస్తుంటు. సంఘ సంస్కర్త, సమాజోద్ధారకుడైన ఈ మహీధర్ పేరు విశాలాంధ్ర లోని అన్ని పత్రికల్లోను ఢంకా మ్రోగినట్లు 'ఢమ - ఢమ' ఎలా మ్రోగుతుందో!

మూర్తి : మీరిక్కడకు వచ్చింది—సంఘాన్ని సంస్కరించ డానికికాదు—చదువుకోసం.

రాజు : ఆ సంగతి మాకు తెలుసు.

మూర్తి : ఇక్కడ ఎంతో చదువుతున్నట్లు యింటికి ఉత్త రాలు రాస్తుండటం, యింటిదగ్గరున్న వాళ్ళని మోసగించి డబ్బు తెప్పించుకోవడం! ఛీ! ఛీ! సిగ్గుచేటు. (చదువుతుంటాడు.)

మహీ : మనం వేసే ఎత్తులకు, చేసే మోసాలకు మా నాన్న లొంగితేనా; మనం ఆడింది ఆటా, పాడింది పాటా అయ్యేది. కాని, ఆయన రిటైర్డ్ C. I. D. యిన్స్పెక్టర్. ఆయనదగ్గర మన పప్పు లుడకవు.

(సాధూబాబా వస్తాడు)

బాబా: జై సాయీబాబా! బాబా పేరుమీద ఒక్క కానీ ఈ సాధువుకు వెయ్, బాబ్జీ! నీ భూత భవిష్యద్వర్తమాన కాలాల్లో ఒక్కమాట విడిచిపెట్టకుండా నిక్కముగా చెబుతాం.

రాజు: (బాబా దగ్గర నిలబడి యెగాదిగా చూస్తూ) నీదగ్గర ఒక అణా వుందా?

బాబా: ఎందుకు బాబ్జీ?

రాజు: అణా మార్చుకు వస్తాను-నాలుగు కాన్లు వస్తాయ్. నా చెయ్యి, మా ఫ్రెండ్ చెయ్యిచూచి రెండు కానులు నీవు తీసుకో; మిగిలిన రెండు కాన్లుపెట్టి నే నొక సిగరెట్ కొనుక్కుంటాను.

బాబా: బాబాను హేళనచెయ్యకు బాబ్జీ!

మహీం: నువ్వు చెప్పేదానికి తాళం వెయ్యమంటావా?

బాబా: (కళ్ళుమూసుకుని) జై సాయీబాబా! జై సాయీ!

మహీం: (హేళనగా) జై సాయీబాబా! ఈ యిరవయ్యో శతాబ్దంలో యిదొక పెద్ద అంటువ్యాధిలా పాకిపోయింది. వాళ్ళువంచి పనిచెయ్యడం రాదు - కాషాయవస్త్రాలతో దొంగవేషాలు వేసి, కళ్ళు మూసుకొని, నాలుగు కబుర్లు చెప్పి, ప్రజల్ని మోసంచెయ్యడం బాగా నేర్చుకున్నారు.

మూర్తి: ఛీ! ఛీ! న్యూసెన్స్! (పుస్తకం పట్టుకుని బైట కెళతాడు.)

బాబా: జై సాయీబాబా! జై సాయీ! జై సాయీ!

మహీం : సాయీలేదు - మాయీలేదు. పో బైటకు—ఈ దొంగవేషాలు మనదగ్గర పనిచెయ్యవు.

బాబా : (కళ్ళు మూసుకుని) జై సాయీబాబా! జై సాయీబాబా! ఆఁ.........ఆఁ............ఆఁ.........బాబా పలుకుతున్నాఁడు. నువ్వు నీ తల్లిదండ్రులకు ఒక్కగా నొక్క కొడుకువట.

మహీం : తప్పు. క్వైట్ రాంగ్.

బాబా : బాబామాట తప్పు అనకు బాబ్జీ! నీకు ముందు ఏడుగురు పుట్టి చచ్చిపోయారు. మిగిలినవాడివి నువ్వొక్కడివే.

మహీం : కరెక్టు.

బాబా : నీ తల్లికి నువ్వంటే అమిత ప్రేమ.

రాజు : ఆ సంగతి నువ్వు పెద్దగా చెప్పాలా? ప్రతి తల్లికి తన సంతానంమీద తప్పనిసరిగా ప్రేమ వుండనే వుంటుంది.

బాబా : (రాజుతో) బాబామాటను హేళనచెయ్యకు బాబ్జీ. (మహీధర్‌తో) చిన్నప్పుడు నువ్వొకసారి నూతిలో పడ్డావ్. నీ కోసం నీ తల్లికూడ నూతిలో దూకింది. నిజమా?—కాదా?

మహీం : (సంతోషంతో) నిజమే బాబా.

బాబా : బాబామాటమీద నమ్మకముంటేచాలు బాబ్జీ. బాబా యెప్పుడూ అబద్ధం చెప్పడు.

మహీం : నిలబడేవున్నారు బాబా! ఇలా, యీ కుర్చీలో కూర్చోండి.

బాబా : సాధువులకు కుర్చీలెందుకు బాబ్జీ!
మహీం : అలాకాదు బాబా! మీరు కూర్చోవాలి.
రాజు : ఈ భక్తులమాట మన్నించాలి.
బాబా : భక్తుల మాటల్ని బాబా నిరాకరించలేడు బాబ్జీ! (కూర్చుని) జై సాయీ!
మహీం : రాజూ! బాబాగారికి కాఫీతీసుకురా.
బాబా : ఈ లోకాన్ని త్యజించి, పరలోకచింతను సాగించే ఈ సాధువుకు కాఫీతో పనిలేదు బాబ్జీ!
రాజు : టీ తెమ్మంటారా?
బాబా : వద్దు... ... ...
మహీం : చల్లగా వుంటుంది. డ్రింకు తెమ్మంటారా?
బాబా : ఊఁ హుఁ!... ... ...
రాజు : పోనీ, బలం చేస్తుంది ఓవల్‌టిన్ తీసుకురానా?
బాబా : (విసుగ్గా) వద్దు బాబ్జీ.
మహీం : ఫలహారం?
రాజు : పాలు?
మహీం : పోనీ, పండ్లు?
బాబా : (విసుగ్గా) బాబాను విసుగెత్తించకు బాబ్జీ! చల్లటి మంచినీళ్ళు చాలు.

(రాజు గ్లాసుతో మంచినీళ్ళు యిస్తాడు. మహీధర్ విసనకర్రతో విసురుతుంటాడు.)

మహీం : ఒరే రాజూ! బాబా సర్వసంగ పరిత్యాగిరా!
రాజు : మూర్తీభవించిన భగవంతుని స్వరూపమేరా!

మహీ : బాబా ! ఒక్కమాట అడగమంటారా ?
బాబా : అడుగు బాబ్జీ.
మహీ : (విసురుతూ) ఈ లోకంలో వింత మనుషులు...
బాబా : విచిత్ర విషయాలు, క్రొత్తవస్తువులు, అనుభవించదగిన అద్భుత సౌందర్యం... ... ...
మహీ : అదే బాబా! ఈ విశ్వవాటికలోని ఆహ్లాదకరమైన సౌందర్యాన్ని చూస్తూవుంటే... ... ...
బాబా : అనుభవిస్తూ, ఆనందించాలని వుంటుంది కదూ, బాబ్జీ ?
మహీ : అదే బాబా! అదే మా జీవితాశయం. (నీరసంగా) కాని, ఈ చదువుమూలంగా హృదయానందకరమైన సౌందర్యాన్ని మనస్ఫూర్తిగా ఆరాధించి, అనుభవించలేక పోతున్నాం.
రాజు : ఈ పరీక్షలవల్ల లోకంలోని విచిత్ర విషయాల్ని తనివితీర వినలేకపోతున్నాం.
బాబా : జై సాయీబాబా !
మహీ : బాబా ! మా జీవితనౌకలు ఆనందసాగరంలో విహరించే ఉపాయం చెప్పు బాబా.
రాజు : ఆనందం మా కాళ్ళముందు సాష్టాంగప్రణామం చేసే మంత్రం చెప్పు బాబా.
మహీ : పోనీ, రూపాయలు తయారుచేసే తంత్రం ఏదైనా వుంటే చెప్పు బాబా !
బాబా : బాబ్జీ ! జీవితమే ఒక యంత్రంవంటిది. ఈ యంత్రానికి మంత్రాలు, తంత్రాలు పనికిరావు.

మహీం : ఇంకేం చెయ్యమంటావు బాబా ?

రాజు : నువ్వు చెప్పింది మాకు వేదాక్షరాలు బాబా! తు చాలు తప్పకుండా ఆచరిస్తాం.

బాబా : బాబ్జీ! ఈ జీవితమనే యంత్రాన్ని బ్రతికిన నాల్గు రోజులు బాగా ఉపయోగించాలి. ఎందుకంటా వేమో, జీవితం బుద్బుదప్రాయం బాబ్జీ! ఏ నిమిషంలో మాయమౌతుందో అర్థంకాదు.

మహీం : అందుకే బ్రతికివున్న నాలుగురోజులైనా భగవంతుడిచ్చిన రెండుకళ్ళతోను సౌందర్యసాగరంలోని అంతు కనుక్కోవాలనుకున్నాం.

బాబా : సౌందర్యానికి అంతులేదు. దాని లోతు తెలుసుకోవాలని ప్రయత్నించేవాళ్ళు లోయల్లోపడి నాశనమైపోతారు.

మహీం : (విసనకర్ర పారేసి) ఈ మెట్టవేదాంతం మాకక్కర్లేదు.

రాజు : మాకు కావలసింది ఆనందం, స్వేచ్ఛ, సుఖం.

మహీం : అవి యెలా లభిస్తాయో చెప్పు.

బాబా : ఆధ్యాత్మిక ఆనందానికి దైవధ్యానం ముఖ్యం.

మహీం : ఆధ్యాత్మికం వద్దు - సాధ్యాత్మికం వద్దు. మాకు ఈలోకంలో ఆనందంగా బ్రతకడం కావాలి.

బాబా : జై సాయీబాబా ! ఈలోకంలోని ఆనందానికి కీలకం ద్రవ్యం.

మహీ: Very good. You caught the point. అయితే, బాబా! నీదగ్గర డబ్బును తయారుచేసే యంత్రం గాని, మంత్రంగాని, తంత్రంగాని, యేదైనావుందా?

బాబా: తెలివితేటలుంటే డబ్బు దానంతటదే మీకాళ్ళ ముందు నాట్యంచేస్తుంది బాబ్జీ.

రాజు: తెలివితేటలకేం? కావలసినన్ని వున్నాయి. డబ్బు వచ్చేమార్గం చెప్పు.

బాబా: మీ పెద్దలుగడించిన ఆస్తి వుంటే.........

రాజు: పెద్దలు గడించింది వుంటే, దద్దమ్మల్లాగ ఎందుకుంటాం?

బాబా: అయితే ఒకే ఒక మార్గం వుంది.

మహీ: }
రాజు: } ఏమిటది?

బాబా: చక్కగా చదువుకోడం.

మహీ: (విసుగ్గా) ఏడిసినట్టేవుంది!

రాజు: ఈ ముండమోపు సలహా మాకు తెలీదూ?

బాబా: జై సాయీబాబా! మీకు మంచి అదృష్టం వుంది. పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తారు. మంచి హోదాతో వెలుగుతారు.

రాజు: ఉద్యోగం ఎవరికి కావాలయ్యా?

బాబా: బాగా డబ్బు సంపాదిస్తారు. డబ్బు మీ పాదాల ముందుకు పరుగెత్తుకు వస్తుంది.

రాజు: అదే కావాలి బాబా!

బాబా : అదీ వస్తుంది, అన్నీ వస్తాయి. ప్రపంచమంతా మీ అరచేతిలో. రాట్నంలా తిరుగుతుంది.

మహీ : (సంతోషంతో) థేంక్యూ బాబా, థేంక్యూ.

బాబా : ఈ లోకాన్నంతా కీలుబొమ్మలాచేసి ఆడించగల శక్తి మీలోవుంది.

మహీ : (గట్టిగా) బాబాకీ......

రాజు : జై !

బాబా : ఐతే ఆ శక్తిని జాగ్రత్తగా వినియోగించుకోవాలి. అప్పుడే మీకు యీ జీవితంలో ఆనందం లభిస్తుంది.

మహీ : అందుకు తేలికైనమార్గం చెప్పు, బాబా !

రాజు : సూక్ష్మంగా పరీక్షల్లో మోక్షం లభించే మార్గం చెప్పు బాబా !

మహీ : గగనవీధుల్లో, ఆశా హర్మ్యాలమధ్య, ఆనందపు టుయ్యాలలో హాయిగా వూగడానికి కావలసిన సామగ్రి—యిందాక నువ్వు చెప్పావుచూడు, ద్రవ్యం—ఆ ద్రవ్యం దొరికే ఉపాయం చెప్పు.

రాజు : జపం చెయ్యమంటావా ?

బాబా : జపాలు-తపాలు చేస్తే ద్రవ్యం లభించదు బాబ్జీ ! డబ్బు సంపాదించాలంటే చాల శ్రమపడాలి. దీనికి మూడు మెట్లున్నాయ్......

రాజు : ఏమిటవి ?

బాబా : మొదటిది బాగా కష్టపడి చదవడం, రెండవది పరీక్షల్లో పాసవడం, మూడవది మంచి ఉద్యోగం సంపాదించడం.

మహీం : నాన్సెన్సు ! మళ్ళీ నువ్వు ఆరంభించావా ?

బాబా : ఇదే ఆరంభం, యిదే అంతం. మీ జీవితాలు బాగుపడాలంటే, లక్షణంగా చదువుకోవాలి. జై సాయీం !

మహీం : చాల్లే. ఇహ వెళ్ళు. ఎవరు చెప్పినా 'చదవాలి, చదవాలి' ఛీ! ఛీ !

బాబా : ఆగ్రహించకు బాబ్జీ ! బాగా చదివితే, బాబా అనుగ్రహిస్తాడు.

మహీం : పో, పోవయ్యా ! కోతిలా నువ్వు నాకు నీతులు నేర్పాలని వచ్చావా ? పో, బయటకు.

బాబా : జై సాయీ ! కోప్పడకు బాబ్జీ ! మీ యింటిదగ్గర నుంచి నీకు డబ్బు పంపిస్తున్నది—కబుర్లతో కాల క్షేపంచేస్తూ, వూరంతా తిరగమనికాదు.

మహీం : ( కోపంగా ) ఈ వేదాంతం మాకూ తెలుసు, ( గెంటుతూ ) ముందు నువ్వు బైటకెళ్ళు.

బాబా : ( కోపంగా ) ఛీ ! ఛీ ! ఛీ ! మీ అమ్మ నిన్ను గాడిదిలా తయారుచేసింది.

మహీం : ( చాల కోపంతో ) ఆఁ ! ఏమన్నావ్ ? గాడిదా ! నన్ను గాడిదంటావా ?

బాబా : ఔనురా, గాడిదా !

మహీం : ఆఁ ! ఆఁ ! దొంగవేషం వేసుకుని నన్ను గాడి దంటావా ?

(అంటూ మహీధర్ బాబా గడ్డం పట్టుకుని గట్టిగా లాగు తాడు. గడ్డం వూడిపోవడం, బాబా చెయ్యి మహీధర్ చెంపమీద 'ఛెళ్' మనడం, రాజు కాళ్ళకు బుద్ధిచెప్పడం— మూడు ఒకేసారి జరుగుతాయి. మహీధర్ బిక్క మొహంతో చెంప సవరించుకుంటాడు.)

మహీ : నాన్నా!

బాబా : ఇదే నేమిరా నువ్వు చదివేది?

మహీ : (మాట్లాడడు.)

బాబా : ఉత్తరాలమీద ఉత్తరాలు, టెలిగ్రాంలు యిచ్చి డబ్బు తెప్పించుకోవడం, యిక్కడ కోతిలా తిరగ డానికేనా?

మహీ : కాదు,- నాన్నా!

బాబా : ఏమిటికాదు, దొంగసన్యాసి! ఈ రెండు సంవత్స రాలు నీకోసం 5 వేలు ఖర్చుపెట్టింది మీ అమ్మ, ఇహ చాలు. ఇంటికి నడు; ఉన్నదే తింటూ కూర్చుందువుగాని!

మహీ : పరీక్షలు.........

బాబా : పరీక్షలు! నీ ముఖానికి పరీక్షలుకూడా ఎందుకు? నీమూలంగా చక్కగా చదువుకునేవాళ్లుకూడా పాడై పోతారు. పరీక్షలు వద్దు—ఏమీ వద్దు. నడు, యింటికి. (మెడమీద చెయ్యిపెట్టి తీసుకెళుతుం టాడు.)

మహీ : నాన్నా! ఈ ఒక్కసారి......

బాబా : ఇహ నిన్ను క్షమించను. (గట్టిగా) నడు.

(ఇద్దరు వెళుతుండగా తెర)

౧౩

# కుంభకోణం

(ఏకాంక నాటిక)

—♦ పాత్రలు ♦—

సుందర్రామయ్య : ప్రొడ్యూసరు

రవిబాబు : డైరెక్టరు

గోపీదాసు : పాత రచయిత

కవికుమార్ : క్రొత్త రచయిత

యువకుడు : నాటక నటుడు (వేణునాథం)

గోపాలం : గుమస్తా

నౌకరు

కళాదేవి : నటి

[ స్థలం: ఒక స్టుడియోలో నిర్మాతగది. గదిలో ఒక డ్రాయరు, రెండు కుర్చీలు, రెండు సోఫాలు ఉన్నాయి. డ్రాయరుమీద టెలిఫోను ఉంది. గోడలకు నటీ నటుల అందమైన ఫోటోలు అమర్చబడి ఉన్నాయి.

నిర్మాత సుందర్రామయ్య కుర్చీలో కూర్చుని సిగరెట్టు కాలుస్తుంటాడు. అవతల గదిలో గట్టిగా మాట్లాడుతున్నట్లు, గొడవపడుతున్నట్లు శబ్దం వినిపిస్తుంది. సుందర్రామయ్య ముఖం ఎర్రబడుతుంది. 'బెల్' వాయిస్తాడు. నౌకరు వస్తాడు ]

సుంద : ఏమిట్రా ఆ గొడవ ?

నౌక : ఎక్కడ బాబూ ?

సుంద : బాబూ ఏమిటిరా, నీ ముఖం ! 'సార్' అనలేవూ ?

నౌక : ఏం గొడవ సార్ ?

సుంద : ఏడిసినట్టే ఉంది ! తిరిగి నన్నే ప్రశ్న వేస్తున్నావ్ ? ఆ రిహార్సల్ గదిలో గొడవేమిటని ?

నౌక : చూడమంటారా ?

సుంద : నువ్వు చూసి వచ్చేసరికి తెల్లవారుతుంది. చూడక్కర్లేదు—పెట్టక్కర్లేదు. ఆ డైరెక్టర్ని యిలా పిలు.

నౌక : అలాగే సార్. ( వెళ్ళిపోతాడు. )

సుంద : వీడొక గంగిరెద్దులాంటి మనిషి. పట్నం రావద్దురా అంటే, విన్నాడుకాదు. పోనీ, వచ్చినవాడు ఎక్కడెలా నడుచుకోవాలో చెప్పినా తెలుసుకోడు ; పొమ్మంటే పోడు. శుద్ధ మొద్దావతారం.

[ ఒక యువకుడు లోపలకొస్తాడు. అతను తొడుక్కున్న పరాయి, లాల్చి అతని శరీరాన్ని అంటడంలేదు. అతను పెట్టుకున్న కళ్ళజోడుకూడ ఆ ముఖానికి బాగాలేదు. సన్నగా దీనంగా ఉన్నాడు ]

యువ : ( సంశయిస్తూ ) క్షమించాలి.........

సుంద : (ఎగాదిగా చూచి) మిమ్మల్ని......

యువ : మీరు రమ్మనలేదు. అనుమతి అడిగినా లభించదేమోనని, నేనే వచ్చాను.

సుంద : పరవాలేదు, కూర్చోండి.

యువ : (కూర్చుంటూ) నన్ను 'కవికుమార్' అంటారు.

సుంద : ఆఁ! కవిగారి కుమారులా ?

కవి : (కొంచెం ధైర్యం తెచ్చుకొని) కాదు. నా తండ్రి కవిగాడు. కాకుండా ఉండటమే మంచిదనుకున్నాను. ఇహ, నాకు పుట్టేకొడుకులుకూడ కవులుకావడానికి నే నొప్పుకోను. పోతే, నాపేరే 'కవికుమార్'.

సుంద : ఓహో! బాగుంది. ఐతే మీరు కవిత్వం రాస్తారా?

కవి : లోగడ రాసేవాణ్ణి.

సుంద : ఇప్పుడు ?

కవి : లాభంలేదని పూరుకున్నాను.

సుంద : మంచిపని చేశారు.

కవి : రీములు రీములు కవిత్వంతో నింపేశాను. ప్రయోజనం కన్పించలేదు. చివరకు కాగితంధరకూడ రాలేదు.

సుంద : పాపం !

కవి : అందుకే కవిత్వం విడిచిపెట్టి కథలు రాస్తున్నాను. అనేక పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. కొన్ని పుస్తక రూపాన్ని కూడ దాల్చాయి. అంతా పొగిడారు, పెద్దపెద్ద సభల్లో ప్రశంసించారు. కాని పొట్టమాత్రం ఏడుస్తోంది.

సుంద : ప్రస్తుతం తమరు దయచేసిన పని ?

కవి : సినిమాకథలు కావాలని మీరు పత్రికల్లో ప్రకటించారు ; చూచాను. కాని మీ కెటువంటి కథలు కావాలో అర్థంకాలేదు. మీకు ఉత్తరం రాసినా

జవాబు లేదు. అయినా నిద్రాహారాలు మాని, ఏవేవో రాసి తెచ్చాను.

సుంద : ఏంకథలు రాశారు?

కవి : ఒక రకంకాదు; అన్నిరకాల కథలూ రాశాను—ప్రేమకథలు, పౌరాణికగాథలు, రాజకీయ కథలు, అపరాధ పరిశోధక కథలు, చారిత్రాత్మక కథలు, ఆర్థిక, సాంఘిక, నైతిక, ధార్మిక కథలు.........

సుంద : అబ్బబ్బ! చాలా చాలా రకాల కథలు రాశారే!

కవి : రకానికి ఒకే కథైతే, మీకు నచ్చదేమోనని, రెండేసి-మూడేసికూడా రాశాను.

సుంద : చాల ప్రతిభావంతులండీ మీరు! మీవంటి యోగ్యుల్ని ఆదరించడం మా ధర్మం.

కవి : (చిరునవ్వు నవ్వుతాడు.)

సుంద : కాఫీ తీసుకున్నారా?

కవి : (సిగ్గుతో) ఆఁ! తీసుకునే వచ్చానండీ!

సుంద : సిగరెట్ అలవాటు లేదనుకుంటాను.

కవి : ఆఁ, ఆఁ! లేనట్టే.

సుంద : ఏమనుకోకండి—ఒక్కమాట అడుగుతాను.

కవి : అడగండి.

సుంద : ఈ కథలన్నీ మీరు సొంతంగానే రాశారా?

కవి : (కొంచెం కోపంతో) సొంతంగా కాకపోతే, చోరీ చేశానంటారా? బాగుందండోయ్! ఇష్టముంటే తీసుకోండి, లేకపోతే లేదు. కాని అటువంటి అసంగతమైన మాటలు మాట్లాడకండి. కావాలంటే

యిక్కడ కూర్చుని కొన్ని వందలు రాస్తాను. మీరు......

సుంద: అహహా! అదేం కాదండీ. మీరు కోప్పడితే ఎలా చెప్పండి! అందులోని మంచి-చెడ్డలు, లోతు-పాతులు సరిగ్గా తెలుసుకోకుండా రెండువేలు, మూడువేలు పోసి, ఎలా తీసుకుంటాం చెప్పండి?

కవి: (చల్లబడి) నేను, నాచేత్తో. నా సొంత భావాలతో, నా క్రొత్త ఊహాలతో స్వయంగా వ్రాశాను. చాలా?

సుంద: చాలు, చాలు. ఆఁ! ఎలా యిస్తామంటారు?

కవి: మీకే కథ కావాలి?

సుంద: ఏదో ఒకటి—చక్కగా ఉండాలి, తక్కువలో కుదరాలి.

కవి: ముందు ఏకథ నచ్చిందో చూడండి. తర్వాత బేరం కుదుర్చుకోవచ్చు.

సుంద: వెరీగుడ్! మీదగ్గరున్న కథలన్నీ యిలా ఇవ్వండి; మా డైరెక్టరుకు చూపిస్తాను. ఈలోగా మీరు స్టూడియో ఒకసారి చూసి రండి.

కవి: (కథలన్నీ యిచ్చి) అలాగే త్వరగా చూడమనండి, నాకు యింకా చాలా పనుంది.

సుంద: అలాగలాగే!

(కవికుమార్ వెళ్ళిపోతాడు)

సుంద: (గట్టిగా) గోపాలం! గోపాలం!

(ఇరవై సంవత్సరాల యువకుడు వస్తాడు)

గోపా : ఏం సార్ !

సుంద : నువ్వూ, యింకో నలుగురు కలిసి, ఈ కథలన్నీ ఒక్క-గంటలో కాపీ చెయ్యాలి.

గోపా : ఎందుకు సార్ కాపీచెయ్యడం?

సుంద : ఎందు కేమిటి, చెయ్యమని చెబితే! (కథలిస్తాడు)

గోపా : (తీసుకుని) అలాగే సార్ ! (వెళ్ళిపోతాడు)

సుంద : అంతా అవతారాలే. ఒక్కడికీ బుర్రలో మెదడు లేదు.

(డైరెక్టరు రవిబాబు వస్తాడు)

రవి : పిలిచారా?

సుంద : ఆఁ, ఆఁ. రండి. (రవిబాబు వచ్చి కూర్చుంటాడు.) ఏమండీ! ప్రొద్దున్నుంచీ రిహార్సల్‌తోను, గొడవల తోను కాలం గడిపేస్తుంటే, 'సీను' ఎప్పుడు తయారవుతుంది?

రవి : అంతా సిద్ధం చేశాను. కాని పెద్దడైలాగొకటుంది. కళాదేవి దాన్ని సరిగ్గా పలకలేకపోతోంది.

సుంద : ఎందుకని?

రవి : పెద్ద పెద్ద వాక్యాలున్నాయి.

సుంద : వాటిని చిన్నవి చెయ్యండి.

రవి : అలా చేస్తే, ఆ డైలాగులోని 'టెంపో' పోతుంది.

సుంద : ఐతే పూర్తిగా తీసిపారెయ్యండి.

రవి : చాల తేలిగ్గా చెప్పారు. కాని ఆ డైలాగు తీసేస్తే కథే అడ్డం తిరుగుతుంది.

సుంద : పోనీ, కొన్ని శబ్దాలు 'కట్' చెయ్యండి.

రవి : మీరు చెప్పినంత సులువుగా పని జరిగేటట్లుంటే, నే నింతవరకు బు|్రెందుకు పాడుచేసుకుంటానండీ!

సుంద : ఐతే, ఆ డైలాగు యెవరిచేతనైనా చెప్పించండి.

రవి : (కంగారుగా) ఎవరిచేత చెప్పించమంటారు?

సుంద : ఏమిటండీ రవిబాబుగారూ! మీరు కొంచెం తెలివి తేట లుపయోగించాలి. మన పాటలకు 'ప్లేబాక్' పెట్టడంలేదూ! అలాగే డైలాగుకుకూడ యెవరిచేత నైనా చెప్పించండి.

రవి : ఇంత కుంభకోణం చేసేకంటె, ఆ కళాదేవిని తీసేసి, మరొక తారను 'బుక్' చేస్తే బాగుంటుంది.

సుంద : నో, నో, నో. అలాకాదు. ఆమే ఉండాలి. మీ రనవసరంగా 'టైం వేష్టు' చేస్తున్నారు. వెళ్ళి, అన్నీ సిద్ధం చెయ్యండి. నేను గోపీదాసుకు ఫోనుచేసి, డైలాగు మార్పిస్తాను.

రవి : మీ యిష్టం. ( వెళ్ళిపోతాడు )

సుంద : (టెలిఫోను నెంబరు త్రిప్పి ) ఎవరు?... ...పంతులు గారేనా?... ...నమస్కారాలండీ!... ...ఏం చేస్తు న్నారు?... ...కొత్తకథా?... ...ఓహో!... ... ఒక్కసారి వస్తారూ?... ... ...కొంచెం పనికూడ ఉంది... ... ...కారా?—ఎందుకండీ? ట్రాంలో రండి... ...ఓహో, అన్నట్టు ట్రాంలు లేవుకదూ? పోనీ, సిటీబస్‌లో రండి... ...తీరికచేసుకు వస్తారా?

......అబ్బెబ్బే! అర్జంటుపనండీ! పోనీ కారు పంపిస్తానులెండి; త్వరగా రండి. ఆఁ?...అ...అలాగే!

(టెలిఫోను పెట్టేసి, 'బెల్' వాయిస్తాడు. నౌకరు వస్తాడు)

నౌక: ఏం బాబూ!

సుంద: బాబూ ఏమిటిరా, నీముఖం? ఎన్నిసార్లు చెప్పాలి? —సార్ అనలేవూ?

నౌక: ఇరవై సంవత్సరాల అలవాటు ఒక్కసారి ఎలా పోతుంది?

సుంద: అందుకే నిన్నిక్కడకు రావద్దన్నాను.

నౌక: పోతానులెండి. ఏదో పట్నం చూడాలని వచ్చాను గాని......(ఏడుపుముఖం పెడతాడు.)

సుంద: తర్వాత ఏడుద్దూగాని, ముందు డ్రైవర్ని కారు తీసుకుని గోపీదాసుగారింటికి వెళ్ళమను.

నౌక: అలాగే! (వెళ్ళిపోతాడు)

(కొంతసేపు నిశ్శబ్దం. అకస్మాత్తుగా తలుపులు తోసుకొని కళాదేవివచ్చి ఏడుస్తూ నిలుచుంటే)

సుంద: (లేచి) అయ్యయ్యో! అదేమిటి కళాదేవి? ఎందుకేడుస్తున్నావ్? (కళాదేవి యింకా వెక్కి వెక్కి యేడుస్తుంది.) చూడు, నువ్వలా యేడుస్తుంటే నా హృదయం గిజగిజ లాడుతోంది. కారణం చెప్పకుండా వూరకే యేడిస్తే యెలా చెప్పు?

కళా: నే నీ 'పిక్చర్'లో నటించను.

సుంద: ఆఁ!

కళా : నన్ను మాపూరు పంపించెయ్యండి.

సుంద : అదేమిటి కళాదేవీ! నువ్వు లేకపోతే, ఈ పిక్చ రెందుకైనా పనికొస్తుందా? మ్చ! నువ్వు లేకపోతే యీ సుందర్రామయ్య ఐ. పీ. దాఖలుచేసి స్వర్గానికి ప్రయాణంకడతాడు.

కళా : ఐతే నన్నెందు కిలా యేడిపిస్తారు?

సుంద : అసలు సంగతేమిటో చెప్పు. నేను సరిచేస్తాను. (దగ్గరకువచ్చి, గడ్డంపట్టుకుని) చిన్నపిల్లలా మారాం చేస్తే యెలా చెప్పు?

కళా : (కొంచెం సిగ్గుపడి) మీ దగ్గర 'ప్లేబేక్' పాడేవాళ్ళు లేరూ?

సుంద : ఎందుకులేరు? హేమాహేమీ లున్నారు.

కళా : నా డైలాగ్సుకూడా వాళ్ళచేతే చెప్పించండి.

సుంద : నేనూ అదే అనుకున్నాను. కాని, నీ కంఠంలో వుండే మాధుర్యం, నీ మాటలలోని పొందిక, నీ ఉచ్చారణలోని స్వచ్ఛత, 'ప్లేబేక్'' పాడే గాయకుల గొంతుకోసినా వుంటుందా అని?

కళా : (కొంచెం గర్వంగా) మీరు ప్రతిదానికి యిలాగే సర్ది చెప్పేస్తుంటారు.

సుంద : నువ్వలా అంటే నేనేం చెప్పను, చెప్పు? నీ అందం, నీ మాటలతీరు, నీ నటన; గొప్పతారలమని చెప్పుకునే యే నటీమణికుంది చెప్పు? ఇదే ప్రథమంగా! ఇంకా కొంచెం ప్రాక్టీసుచేసి, మరొక రెండు పిక్చర్లలో నటించావంటే విశాలాంధ్ర అంతా నీ పేరు

ఘంకా మ్రోగినట్లు మ్రోగిపోతుంది. ఇప్పుడున్న యేగానీ నాయకీలంతా 'రిటైరై' 'పించను' తీసుకుంటారు. అప్పుడు నువ్వు 'ఫస్ట్‌క్లాస్ ఏక్టరస్'గా తయారవుతావ్. (కళాదేవి ముఖంవంక చూస్తూ) 'ఉత్తమనటీమణుల పోటీ' జరిపిస్తాను; నిన్ను ఉత్తమ నటిగా చేస్తాను. బంగారుపతకాలు కుప్పలు, కుప్పలుగా వచ్చిపడతాయ్. ఇహ చూసుకో! సన్మాన పత్రాలు, ఆహ్వానాలు, సభలు-సమావేశాలు, విందులు-విహారాలు.........ఓహోహో! వర్ణించడానికి శబ్దాలు చాలడంలేదు.

కళా : మాటలు బాగా నేర్చారండీ!

సుంద : ఎన్ని మాటలు నేర్వకుండా, ఎన్ని ఆటలాడకుండా ఆ పల్లెటూరి నుంచి ఈ పట్నానికొచ్చి, ప్రొడ్యూసరు నవ్వగలిగాను చెప్పు? సుందరామయ్యంటే సూర్యు డెదురొస్తాడు. (ఆగి) ఇందాకటినుంచీ నిలబడే ఉన్నావ్! - కూర్చో.

కళా : (కూర్చుంటూ) కాని, ఆ రవిబాబుగారి తరహా చూస్తుంటే వొళ్ళు మండుతోంది. ఒక్క వాక్యాన్ని వందసార్లు పలికిస్తారు. పలకడంమాట అట్టే ఉంచండి, ఆ శబ్దాలు అర్థంకాక, నోరు తిరగక అల్లాడిపోతున్నాను.

సుంద : కొంచెం కష్టపడాలి మరి!

కళా : అలా అనుకునే కంటే, రాసిన వాళ్ళదే తప్పని ఎందుకనుకోగూడదు?

సుంద : అవునవును. ఎందుకు కాకూడదు? అందుకే గోపీ
దాసును రమ్మని ఫోనుచేశాను.

( రవిబాబు వస్తాడు - కళాదేవి మూతి ముడుచుకుంటుంది )

రవి : ( కళాదేవితో ) ఇక్కడే కూర్చుంటే, ఎలా? ... ...

సుంద : ( పూట కల్పించుకుని ) ఏమండీ! కళాదేవిని చంపుకు
తినేకంటే, ఏదోవిధంగా సర్దేయలేరూ?

రవి : బాగుందండోయ్! ఇదేమైనా వంకాయల కూర
గనకనా, ఏదోవిధంగా వండేయడానికి? - ఇది అభి
నయం. అభినయమంటే కొంతవరకు పుట్టుకలోంచే
రావాలి; మరికొంత అభ్యాసం చెయ్యాలి. ఏదీ లేక
పోతే ఎలా?

కళా : పొద్దుటనుంచి, తల బద్దలయ్యేటట్లు చేసిందే వంద
సార్లు చేస్తున్నాను, ఇంకా ఏం చెయ్యాలి?

రవి : దాదాపుగా చాలవరకు కుదిరింది. ఇహ, రెండు మూడు
డైలాగ్సులో కాస్త లోపం కనిపిస్తోంది.

సుంద : ఏం డైలాగ్సు, డైరెక్టరుగారూ! పాపం, పండు
లాంటి పిల్లను పిండి చేసేస్తున్నారు. అదీగాక, ఏ
డైలాగున్నా, ఆమె కనువుగా ఉండాలిగాని, కొర
గాని వెందుకని?

రవి : ఆమె కనువుగా, పూర్తిగా చౌకపద్ధతిలో రాస్తే,
అర్థమంతా పోతుంది.

సుంద : అర్థ మెవడికి కావాలయ్యా?—ఏదో సర్దుకుపోవాలి
గాని!

రవి : అన్నీ మీకే తెలిసున్నట్టు చెబితే నేనెందుకు ? రచయిత లెందుకు ?

సుంద : (కోపంగా) ఔను. అన్నీ మాకు తెలుసు. పల్లెటూరి పశువులంకాము. కావాలంటే అన్నీ మేమే చేసుకోగలం; లేదంటే మీలాంటివాళ్ళను లక్షా తొంభై మందిని కొనగలం.

రవి : (కంగారుగా) అసలు నేను చెప్పేది వినండి.

సుంద : చాలు. ఇహ వెళ్ళండి. ఆమె యెలా నటిస్తానంటే, అలాగే నటించనివ్వండి. ఎలాపలికితే అలాగే రికార్డు చెయ్యండి—తెలిసిందా ?

రవి : సరే, మీ యిష్టం. కాని డైరెక్టరుగామాత్రం నాపేరు వేసుకోను.

సుంద : పోనీ నా పేరే వెయ్యండి. ఇందులో పోయేదేముంది? మీకు యిచ్చేడబ్బు యెలాగూ యిస్తాను.

(డైరెక్టరు చిన్నముఖం చేసుకుని వెళ్ళిపోతాడు. సుందర్రామయ్య కళాదేవివంక చూసి నవ్వుతాడు. ఇంతలో నౌకరువస్తాడు)

నౌక : ఎవరో వచ్చారుసార్ !

సుంద : ఎవరు ?

నౌక : అడిగి రమ్మంటారా ?

సుంద : అక్కర్లేదు. ఇప్పుడు మాట్లాడ్డానికి ఖాళీ లేదని చెప్పు.

నౌక : కాస్సేపు కూర్చోమన్నా ?

సుంద : వద్దు. ఇవ్వాళ మాట్లాడ్డం కుదరదని చెప్పు.

నౌక : రేపు రమ్మన మంటారా ?

సుంద : ఏడిశావ్! బైటకు గెంటి, అవతలకు పంపు.

(నౌకరు వెళుతుంటే, ఆడంబరంగా అలంకరించుకున్న ఒక అందమైన యువకుడు వస్తాడు. నౌకరు అతిన్నిచూసి నిర్ఘాంతపోతాడు)

యువ : (సుందరరామయ్యతో) క్షమించాలి... ... ...

సుంద : (ఎగాదిగా చూస్తూ) ఆఁ!

యువ : నమస్కారాలు.

సుంద : గుడ్‌మార్నింగ్.

యువ : (కుర్చీలో కూర్చుంటూ) కూర్చోమంటారా?

సుంద : కూర్చుంటా నంటారా?

యువ : నిలబడ్డం అలవాటు లేదు.

కళా : అందుకే కూర్చున్నారుగా! (నౌకరు వెళ్లిపోతాడు)

యువ : (కళాదేవివంక చూసి) ఆఁ? ఔనౌను.

సుంద : మిమ్మల్ని ఎక్కడో... ... ...

యువ : చూసే ఉంటారు. మైరావణ, తులాభారం, ఉద్యోగ విజయాలు, లంకాదహనం, కనకతార, జండాపై కపిరాజు, కృష్ణలీలలు, సీతాపరిణయం, రామ లక్ష్మణా— పొరపాటు —రామ రావణా యుద్ధం వగైరా వగైరా నాటకాల్లో ఏదైనా చూశారా?

సుంద : (ఆలోచిస్తూ) జ్ఞాపకం రావడంలేదు.

యువ : పోతే, బెజవాడ ప్లాటుఫారంమీదో, రాజమండ్రి మెరకవీధిలోనో, కాకినాడ లైటు స్తంభందగ్గరో, గుంతకల్లు జంక్షన్‌లోనో—అక్కడా యిక్కడా అని

లేదు; అన్నిచోట్లా ఉంటాను. ఎక్కడో చూసే ఉంటారు.

సుంద : ఇంతకూ మీ రెవరు ?

యువ : అవమానం, అవమానం; కళకే అవమానం.

కళా : ఎవరండీ మీరు ?

యువ : కళాసేవకుణ్ణి, కళారాధకుణ్ణి, కళోపాసకుణ్ణి. ఒక్క మాటలో చెప్పాలంటే కళే నేను, నేనే కళ. కళ కోసం బ్రతుకుతున్నాను, కళకోసమే చస్తాను.

కళా : చాల విచిత్రంగా మాట్లాడుతున్నారే !

యువ : విచిత్రంకాదు, నిజం. కళకు నేను దాసుణ్ణి. కళ లోనే నా జీవన్మరణాలు మిళితమయ్యాయి. ప్రతి వస్తువులోను నాకు కళ కన్నులకు కట్టినట్టు కని పిస్తుంది. ఈ గదిలో, ఆ చిత్రాల్లో, (సుందరరా మయ్య ముఖంవంక చూస్తూ) మీ మీసాల్లో, (కళా దేవి కళ్ళల్లోకి చూస్తూ) మీ కళ్ళలో—అన్నిటి లోను జీవకళ కన్పిస్తుంది, ఆరాధిస్తాను. ఆనందిస్తాను. (ఆగి) క్షమించాలి. మీ రెవరు ?

సుంద : ఆమె మా పిక్చర్లో హీరోయిన్.

యువ : ఓ, అలాగా ! బాగా పాడగలరా ?

కళా : పాటలైతే బాగానే పాడగలను, కాని మాటలు సరిగ్గా రావు.

యువ : ఐతే మీరు నాటకాల్లో బాగా రాణిస్తారు. ప్రేక్ష కుల 'వన్స్‌మోర్' మోతల్లో మీ కంఠం ఉబ్బి తబ్బిబ్బైపోతుంది. కాని సినిమాల్లో ఆ అవకాశంలేదు.

సుంద : (విసుగ్గా) మీరు వచ్చిన పనేమిటి ?

యువ : ఓ, క్షమించాలి ! నా పేరు మీ రడగలేదు. ఐనా చెబుతాను; వేణునాథం. చక్కగా పాడతాను. ముచ్చటగా నటిస్తాను... ... ...

సుంద : ఐతే ?

యువ : ఈ మధ్య పత్రికల్లో మీ ప్రకటన చూసి, ఏదైనా అవకాశం దొరుకుతుందేమోనని వచ్చాను.

సుంద : నటించాలనేగదూ !

యువ : నటించడంలోను సామాన్యంగా కాదు—బ్రహ్మాండంగా నటించాలని వచ్చాను.

సుంద : ఒక్కమాట వింటారూ ?

యువ : ఎందుకు వినసూ ?

సుంద : మా కంపెనీలో ఒక నియమముంది.

యువ : ఏమిటది ?

సుంద : ఆ నియమానికి మీరు కట్టుబడి ఉంటారా ?

యువ : ఓ, ఏ నియమానికైనా సరే, బద్ధుడనై ఉంటాను, చెప్పండి.

సుంద : క్రొత్తగా మా కంపెనీలో చేరి, మా ఫిల్ముల్లో నటించాలనుకునేవాళ్ళు ఐదువేల రూపాయలు అడ్వాన్సు యివ్వాలి, ఆనుమానాలు... ... ...

యువ : ( గుండె ఆగిపోయినంత పని జరిగింది ) ఉండండి, కాస్త ఉండండి. ( ఒక క్షణం నిశ్శబ్దం. అతని ఆరాటం చూసి కళాదేవి కంగారు పడుతుంది. ) ఐదు వేలుకదూ, మీ రడిగింది !

సుంద : ఔను. అది మా కంపెనీ రూలు.

యువ : కాని మహాశయా! ఐదువేలు కాదుగదా, ఐదు వందలుండి, అందమైన ఆడది ప్రక్కనుంటే, ఆంధ్రా అంతా టూర్ చేసి, ఐదు లక్షలు సంపాదించేవాణ్ణి.

సుంద : అలాగే చెయ్యండి.

యువ : ఆడదీ లేదు, ఐదువేలూ లేవు. ( నెమ్మదిగా ) చివరకు చిల్లుకానీకూడ లేదు.

సుంద : అయితే, ఇహ మీరు వెళ్ళొచ్చు.

యువ : ( దీనంగా ) అలా అంటే ఎలా చెప్పండి? పది సంవత్సరాల నాటకానుభవముంది, అందవికారిని కూడ కాను; ఏదో కాస్త అవకాశమిస్తే.........

సుంద : అదేం లాభంలేదు. ఇప్పుడు ఏవీ ఖాళీలుకూడ లేవు. దయచేసి వెళ్ళండి. ( బెల్ వాయిస్తాడు. )

యువ : మీరు దయచూపాలి. కళకోసం పాటుపడి, చివరకు కాఫీకికూడ గతిలేక బాధపడుతున్నాను.

కళా : పాపం ఏదో చిన్నపాత్ర యివ్వండి!

సుంద : నీకు తెలీదు వూరుకో. ( నౌకరు వస్తాడు ) ఇతన్ని బైటకు పంపరా.

నౌక : బండిమీదా? కారుమీదా సార్?

సుంద : ఏడిశావ్. గేట్ దాకా సాగనంపరా.

నౌక : (వేణునాథంతో) ఏమండీ! మీకు దారి తెలీదా? తెలియకపోతే లోపలకెలావచ్చారు? వచ్చినవాళ్ళు బైట కెందుకెళ్ళలేరు?

సుంద : అదంతా యెందుకురా నీకు? బైటకు తీసుకెళ్ళి విడిచిపెట్టు.

నౌక : అలాగే సార్ !

యువ : (నిస్పృహతో) ఐతే వస్తాను. (కళాదేవివంక చూసి) వస్తాను.

( యువకుడు, నౌకరు వెళ్ళిపోతారు )

కళా : పాపం! చాల బాధపడుతున్నట్లున్నాడు. ఏదో చిన్న పని చూపించకూడదండీ ?

సుంద : నీకు తెలీదులే. ఇలాంటివాళ్ళు రోజుకు రెండువందల మంది వస్తుంటారు. (ఆగి) నువ్వెళ్ళి ప్రాక్టీస్ చెయ్.

కళా : ఐతే, పేపర్లో క్రొత్త నటీనటులు కావాలని యెందుకు ప్రకటించారు ?

సుంద : అక్కడే ఉంది కిటుకు. క్రొత్తవాళ్లు కావాలని పేపర్లో వేస్తే, పాతవాళ్ళే కాళ్ళబేరాని కొచ్చి, తక్కువకు ఒప్పుకుంటారు.

కళా : హుం! అంతా కుంభకోణమే.

సుంద అదంతా నీకెందుకుగాని, పోయి ప్రాక్టీస్ చెయ్.

( కళాదేవి కోపంతో వెళ్ళిపోతుంది. సుందరామయ్యా సిగరెట్టు కాలుస్తుంటాడు. ఇంతలో గోపీదాసు వస్తాడు. )

సుంద : ఓహోహో! పంతులుగారేనా ? రండి రండి. చాల సేపటినుంచి చూస్తున్నాను.

గోపీ : పనేమిటో కొంచెం త్వరగా చెప్పండి. కాస్త అర్జంటు పనుంది.

సుంద : ఆఁ! ఆఁ! (కొన్ని కాగితాలు చూపించి) ఇవిగో చూడండి. ఈ డైలాగ్సుభావం పోకుండా కొంచెం మార్పు చెయ్యాలి.

గోపీ : అంతేనా ? అరగంటలో చేస్తాను.

సుంద : కాఫీ తెప్పించమంటారా ?

గోపీ : వద్దు.

సుంద : డ్రింకు ?

గోపీ : వద్దు.

సుంద : ఏమికావాలి ?

గోపీ : రెండువందల రూపాయలు.

సుంద : ఎందుకు ?

గోపీ : ఇవి సరిచేసినందుకు.

సుంద : రెండు వందలా ?

గోపీ : చిత్తం.

సుంద : అరగంటపనికి, రెండు వందలా ?

గోపీ : అరగంటయినా, గంటయినా, చిన్నదైనా, పెద్దదైనా వస్తువునుబట్టి విలువ కట్టాలి. చూడండీ, డాక్టరు చిన్న ఆపరేషన్ చేసి ఐదువందలు తీసుకుంటాడు. ప్లీడరు చిన్న సలహాకే వంద రూపాయిల ఫీజు చెల్లించమంటాడు. వాళ్ళకంటే మేమేమి తీసిపోయాం, చెప్పండి ?

సుంద : ఏభై రూపాయి లిస్తానండి.

గోపీ : లాభంలేదు. (లేవబోతాడు.)

సుంద : (కూర్చొబెడుతూ) వందరూపాయలతో సరిపెట్టండి.
(జేబులోంచి చెక్కుబుక్కు తీస్తాడు.)

గోపీ : నాకు చెక్కు వద్దు; రొక్కం కావాలి.

సుంద : రొక్కం లేదే!

గోపీ : (లేచి) తర్వాత వస్తాలెండి, నాకు పనుంది.

సుంద : అయ్యయ్యో! మీ కంత కోపమైతే ఎలా చెప్పండి.
(జేబులోంచి తీసి) మీ యిష్టప్రకారమే తీసుకోండి.

గోపీ : (డబ్బుతీసుకుని, కూర్చుని) ఆ కాగితాలు యిలా యివ్వండి. (కాగితాలు అటు యిటు రెండుసార్లు త్రిప్పి) ఎవడు రాశాడండీ, యీమాటలు! కర్త, కర్మ, క్రియలు లేనే లేవు.

సుంద : అతనిపేరు తెలియదండీ! చౌకగా యిస్తానన్నాడు, సరే అని తీసుకున్నాను.

గోపీ : గుఱ్ఱపుపందాల దగ్గరా?

సుంద : మరొకచోట అలా జరగదుగా!

గోపీ : మీరు గెలిచారనుకుంటాను.

సుంద : అలాగే అనుకోండి.

గోపీ : (కాగితాలు చూస్తూ) అబ్బెబ్బే! ఇది అసలు తెలుగుభాష కాదండి! భాషను ఖూనీ చేశాడు. ఈ డైలాగ్సు పనికిరావు.

సుంద : చూడండీ, పంతులుగారూ! అతను కథ, మాటలు, పాటలు అన్నీ ఒకేసారి రాసి నా కిచ్చాడు; కొన్నాను. కథ చాల బాగుంది. అవతల పారేయడానికి మనసొప్పడం లేదు.

గోపీ : పెట్టెలో దాచండి.

సుంద : మీరు హేళనచేస్తే ఏం చెప్పను? దీనినే ఫిల్ము తియ్యాలనుకున్నాం. (ఆగి) ఒక్కొక్కప్పుడు మనకు నచ్చని మాటలు, పాటలు అదృష్టంకొద్దీ ఆకాశాన్ని అంటుకుంటాయి. ప్రతి సందులోను, ప్రతి వీధిలోను, ప్రతి యింట్లోను, ప్రతి షాపులోను, సంవత్సరాల తరబడి పిన్న పెద్దల నాలుకలమీద నాట్యం చేస్తాయి.

గోపీ : అంతా కుంభకోణంలెండి.

సుంద : అంతే అనుకోండి.

గోపీ : మీ యిష్టం! నాదేంపోయింది! అలాగే చేస్తాను. రేపటికి చేసి వుంచుతాను, ఎవరినైనా పంపించండి.

సుంద : అలాగే పంతులుగారూ!

గోపీ : నమస్తే. (లేస్తాడు)

సుంద : నమస్తే.

(గోపీదాసు వెళ్ళిపోతాడు)

సుంద : అంతా కుంభకోణం.

(గోపాలం వస్తాడు)

సుంద : అన్నీ కాపీ చేశారా?

గోపా : చేశాం, సార్!

సుంద : ఆ కాగితాలు యిలా యిచ్చి, లోపల 'కవికుమార్' అనే ఒక క్రొత్తవ్యక్తి వున్నాడు, ఇలా రమ్మను.

గోపా : అలాగే సార్. (వెళ్ళిపోతాడు.)

(సుందరరామయ్య బెల్ వాయిస్తాడు. నౌకరు వస్తాడు.)

సుంద : చూడు, కళాదేవిని యిలా పిలు.
నౌక : అలాగే సార్ ( వెళ్ళిపోతాడు. )
సుంద : పాపం! కల్లా కపటం తెలియని పల్లెటూరి పిల్ల. అయినా అందంలో లోటులేదు. విగ్రహం చూస్తేనే చాలు, నిగ్రహమంతా మట్టిలో కలిసిపోతోంది. ఈ పిక్చరు పూర్తయితే—( పెదిమ కొరుకుతాడు. )

( కవికుమార్ వచ్చి నిలబడతాడు )

సుంద : కూర్చోండి.
కవి : ( కూర్చుంటూ ) నా కథలెలా ఉన్నాయ్ ?
సుంద : బాగానే ఉన్నాయి.
కవి : ఏవి బాగున్నాయంటారు ?
సుంద : అన్నీ బాగానే ఉన్నాయి. ( ఆగి ) కాని క్రొత్తదనం ఏమీ కన్పించడంలేదు, అన్నీ పాత ఫక్కీలో నడిచాయి.
కవి : మీ కేదయినా నచ్చిందా ?
సుంద : చెబుతున్నాను కదండీ! అన్నీ నచ్చాయి. కాని క్రొత్తదనం లేదు.
కవి : ఏమైనా మార్పులు చెయ్యమంటారా ?
సుంద : ప్రస్తుతం యేమీ వద్దు. క్రొత్తరకం కథలు రాసుకు రండి.
కవి : (నిస్పృహతో) ఇంతకూ యివేమీ పనికిరావంటారా ?
సుంద : అయ్యయ్యో! ఎందుకు పనికిరావండీ ? లక్షణంగా పనికొస్తాయి. కాని, మీ కలం యింకా కొంచెం పదును దేరి క్రొత్తభావాల్ని చిలికించాలి.

కవి : ఆఁ!

సుంద : మీ కథలన్నీ చాలా సాఫీగా వున్నాయి.

కవి : మరి... ...?

సుంద : సినిమాలో కథ సాఫీగా నడిస్తే లాభంలేదు. రకరకాల కుంభకోణాల్ని కల్పిస్తేనే కళ్ళు విప్పారు చూస్తారు.

కవి : ఐతే... ...?

సుంద : మళ్ళీ ప్రయత్నించండి. మంచి కథలు రాయగల శక్తి మీలో, వుంది.

కవి : అంతేనా?

సుంద : ప్రస్తుతం క్షమించండి. ఈ సారి మీరు రాసిన కథ తప్పకుండా నేనే తీసుకుంటాను. (కథలన్నీ యిస్తాడు.)

కవి (తీసుకుని) అంతే నంటారా?

సుంద : ఇహ, వెళ్ళిరండి.

(కవికుమార్ ఏదో అనబోయి, అనలేక వెళ్ళిపోతాడు.)

సుంద : పాపం! అమాయకుడు. (సిగరెట్టు వెలిగించి రెండు దమ్ములు గట్టిగా లాగి) గోపాలం! గోపాలం!

(గోపాలం వస్తాడు.)

సుంద : డైరెక్టరును యిలా పిలు.

గోపా : ఆయన వెళ్ళిపోయారు సార్!

సుంద : ఎక్కడ, కెళ్లారు?

గోపా : ఇంటికి సార్!

సుంద : నాతో చెప్పనక్కర్లే?

గోపా : నన్ను చెప్పమన్నారు సార్ !
సుంద : అతనే చెప్పిపోతే పోయేదేముంది ?
గోపా : ఆయన గౌరవానికే భంగమట సార్ !
సుంద : ఆఁ ! అంత తలబిరుసుతనమా ? ఆ డైరెక్టరు పని వూడకొడితే సరి !
గోపా : ఆయనే విరమించుకున్నారట సార్ !
సుంద : (స్తంభించిపోతాడు) ఆఁ !
గోపా : ఆయన యీ పిక్చరుకు యిహ 'డైరెక్టర్'గా వుండరట ! అసలిక్కడకు రానే రారట !
సుంద : ఎంతపనిచేశాడు! పిక్చరు మధ్యలో తగులడిపోవలసిందేనా ?
గోపా : మీరే 'డైరెక్షన్' చెయ్యండి సార్ !
సుంద : (కొంచెం ఆశగా) నేను చెయ్యగలనంటావా ?
గోపా : ఇందులో పెద్ద కష్టమేముంది సార్ !
సుంద : సరే ! (ధీమాగా) నేనే చేస్తాను.
గోపా : అంతే సార్ ! ఫిల్మ్ యెలావున్నా, ఈరోజుల్లో పెట్టుబడికి మోసం రావడంలేదు.
సుంద : సరే, నువ్వు కాపీచేసిన కథలేవీ ?
గోపా : (కంగారుగా) అన్నీ మీకే యిచ్చానుకదూ !
సుంద : ఆఁ ! కాపీచేసిన కథలుకూడానా ?
గోపా : ఔను సార్ !
సుంద : ఏడిసినట్టేవుంది. కుంభకోణంచేసిపెట్టావ్ ?
గోపా : మీరు చెయ్యమన్నట్టే కాపీచేసి యిచ్చానుకదా సార్ !

సుంద : ( కోపంగా ) ఏడిసినట్టే చేశావ్ లే !

గోపా : ఎందుకు సార్, అంత కోపం ?

సుంద : నోరుమూసుకు పో.

గోపా : ఎందుకండీ, అనవసరంగా మాటలు మీరిపోతారు ? మీారన్న మాటే నేనూ అంటే ?

సుంద : చెంప 'ఛెళ్' మంటుంది.

గోపా : ( కోపంగా ) తర్వాత వీపు విమానంమోత మోగుతుంది. ఇక్కడ గాజులు తొడిగించుకున్నా మనుకున్నారా ? జాగ్రత్త ! మాటలు జాగ్రత్తగా రానివ్వండి. లేకపోతే అసలుకే మోసమొస్తుంది.

( చరచరా వెళ్ళిపోతాడు. )

సుంద : ఎంత పొగరురా నీకు ? కంగారు పడకు, నీ సంగతి పూర్తిగా చూస్తాను.

( నౌకరు వస్తాడు. )

నౌక : ఆమె లేదు సార్ !

సుంద : ఎక్కడ కెళ్ళింది ?

నౌక : ఎవరితోను చెప్పలేదట సార్ !

సుంద : ఎక్కడ కెళ్ళిందో చూడు.

నౌక : ఎక్కడని చూడను సార్ ?

సుంద : ఒక్కర్తె ఎక్కడ కెళ్ళిందోయ్ ?

నౌక : ఒక్కర్తె కాదు సార్.

సుంద : ( కంగారుగా ) ఎవరితో వెళ్ళింది ?

నౌక : ఇందాక మీతో మాట్లాడాడు చూడండీ – ఆ ఉంగ రాల తల మనిషి, నాటకాల్లో కూడ వేషాలేశా నన్నాడు – అతను, ఆమె వెళ్ళారట !

సుంద : ( స్తంభించిపోయాడు. ) ఆఁ !

నౌక : ( కంగారుగా ) ఏం సార్ ?

సుంద : అంతా కుంభకోణమైపోయింది ; ఈసారి సుంద రామయ్య నిజంగా ఐ. పీ. దాఖలు చెయ్యాలి.

( కుర్చీలో కూలబడి, మోకాళ్ళమీద తల పెట్టుకుని కూర్చుంటాడు; నౌకరుకు ఏమీ అర్థంకాక చూస్తుంటాడు– తెర. )



# భిక్షగాడు

(ఏకపాత్ర నాటిక)

[ స్థలం : నాలుగు వీధులు కలిసిన 'సెంటరు.'

రకరకాల స్త్రీ-పురుషులు వస్తూపోతున్నారు. భిక్షగాడు పాట పాడుతూ, వాళ్ళముందు చెయ్యి జాపి నిస్పృహ జెందుతున్నాడు. ]

భిక్షగాడు : (పాట)

బీదవాడిని బాబూ!
భిక్షగాడిని అమ్మా!
ధర్మమెయ్యి తండ్రీ!
దానంచెయ్యి తల్లీ! ॥ బీ ॥

మీ పొలాలు - కలాలు
వల్లెగ నుండాలీ!
మీ పిల్లలు - తల్లులు
చల్లగ నుండాలీ! ॥ బీ ॥

సుఖ సౌఖ్యాల్
శాంతి శ్వాసలు
మీలో పొంగుతు,
పొరలుతు నుండాలీ! ॥ బీ ॥

ధన ధాన్యాల్
కాంతి జ్యోతులు
మీలో మెలుగుతు,
వెలుగుతు నుండాలీ! ॥ బీ ॥

ప్రొద్దున్నుంచి గొంతు చించుకుని ప్రాకులాడితే పావలాడబ్బులుకూడ దొరకలేదు. :... దాన ధర్మాలకు తావు లేని, ఈ పాడులోకంలో వుండేకంటే, చచ్చిపోతేనే బావుండుననిపిస్తోంది... ...నా వాళ్ళంతా చచ్చిపోయారు, నేనూ చచ్చిపోవాలి...చావకుండా యిక్కడుండి—నలుగుర్నీ పీడించడం తప్పిస్తే, చేసేదేముంది? నామూలంగా భూదేవికి బరువేగాని, బలమేముంది? వొళ్ళు కులాసాగా వుండదు, కళ్ళు సరిగ్గా కనిపించవు, కాళ్ళు విరిగిపోయాయి. ఇహ, నేనేం పనికొస్తాను?—ఎందుకూ పనికిరాను......... హుఁ! పనికివచ్చినరోజుల్లో మాత్రం చేసిందేముంది? పట్టుమని పదిరోజులపాటు గుట్టుగా ఎక్కడైనా పనిదొరికితేనా? మ్చ! బీదవాళ్ళ బాధల్ని చూసి ఆదరించే దాత లెక్కడున్నారు? 'బీదవాడు' అన్నమాట వింటేనే దగ్గరకు రావడానికి, రానివ్వడానికి భయపడతారు.........

కాకిలా రెక్కలు కట్టుకుని లోకమంతా తిరిగాను. నన్నుచూసి అసహ్యించుకునేవారే గాని, ఆదరించేవారు ఒక్కరు కనిపించలేదు. నాలో మానవలక్షణాలు లేవని వారి ఉద్దేశ్యం కాబోలు! లేక నన్ను మనిషిగా వుంచడం వారి కిష్టం లేదేమో!...నా కష్టగాథను చెబుతుంటే చీదరించుకున్నారు; నౌకరీ యిప్పించండని వినయంగా అడిగితే నవ్వారు; పని చేస్తానని ప్రాధేయపడితే 'పో, పొ'మ్మన్నారు; చాకిరీ చేస్తానని చావిట్లో కెళితే, చెంపమీద చరిచారు...మనస్సు చివుక్కుమంది. జీవితంమీద విరక్తి

కలిగి ఆనాడే చచ్చిపోదామని గోదావరి ఒడ్డు కెళ్ళాను. కాని... కాని అక్కడ నాలాంటివాళ్ళెంతోమంది కడుపులు మడతకుడుములా చేసుకుని, బండతేరిన గుండెలతో పండు కున్నారు.........ఆకలిబాధతో ఆ చీకట్లో అందర్నీ చూశాను. వాళ్ళకు నాకు ఏమీ తేడా కనిపించలేదు; పైగా ఎంతో దగ్గర సంబంధ మున్నట్టు తోచింది. అయితే వాళ్ళు చావలేదేం?—అందులో ఒకతన్ని "అబ్బీ! మీ రెందుకు బ్రతుకుతున్నారయ్యా?" అని అడిగాను. అతను నన్ను తేరపార చూసి "చావడానికి" అన్నాడు. నేను ఆశ్చర్యపోయాను. అతను మళ్ళీ "కాని, తమ్ముడూ! రాత్రి పూట యిలాంటి వెర్రిమొర్రి ఆలోచనలు పుడుతుంటాయి; పడుకో, ప్రొద్దున్న చెబుతాను" అని కాళ్ళు ముడుచుకుని, కొంచెం చోటిచ్చాడు.........మర్నాటినుంచీ నాపేరు మారిపోయింది. చదువుకున్నవారు చక్కగా 'భిక్షుకుడు', 'భిక్షగాడు' అన్నారు; కొంతమంది నిక్కచ్చిగా 'బిచ్చ గాడు', 'అడుక్కునేవాడు' అన్నారు......కాని మొదట్లో ఒకరిముందు చెయ్యి చాపడమంటే సిగ్గనిపించేది, మనస్సు చివుక్కుమనేది. ఒకొక్క మహానుభావుడు "ఏం, పోతులా వున్నావ్! పనిచేసుకో గూడదూ?" అనేవాడు. "పని చూపించే దాతేడిబాబూ!" అంటే, పళ్లు పటపట కొరుకుతూ, వాళ్లు హూనం చెయ్యడానికి సిద్ధమయ్యేవాడు. ఒకొక్క వ్యక్తి నన్నుచూసి "సోమరి, దున్నపోతు, దరిద్రుడు, శని గాడు, పశువు" అంటూ పెద్ద ఆంజనేయదండకం చదివే వాడు. కాని రానురాను యివన్నీ అలవాటైపోయాయి.

'ఎవరేమన్నా మనల్ని కానట్టు వుండా'లని మాగురువు ముందే నేర్పాడు. కాని, అన్ని అవయవాలు లక్షణంగా వుంచుకుని కాస్తో కూస్తో తెలివి వుండికూడా, అడుక్కోవడమన్నది, నా మట్టుకు నాకే చిన్నతన మనిపించింది......కళ్ళు పొడుచుకుందా మనుకున్నాను......కాళ్ళు విరుచుకుందా మనుకున్నాను. కాని, ఆ పని నా చేత్తో నేను చెయ్యలేక పోయాను. పోనీ, సాటి సోదరుల్లాగ, కళ్ళు మూసుకుని, తడుముకుంటూ 'గుడ్డోడిని బాబూ; గుడ్డోడిని తల్లీ' అంటే బావుంటుందనిపించింది. చాలరోజులు అలాగే చేశాను; డబ్బులుకూడ బాగానే వస్తుండేవి......కాని......కాని, ఆరోజు రైల్లో టి. సి. నా నాటకమంతా చూసి ప్రక్క స్టేషన్లో మెత్తగా తన్నాడు. తలొక చెయ్యీ వేశారు. ఒక పెద్దమనిషి పూర్తిగా కాలే విరిచేశాడు......రెండునెల్లు ఆస్పత్రిలో వుంచుకుని కాలు తీసి బైటకుపంపాడు డాక్టరు. ఇదీ కొంతవరకు మంచిదే అనిపిస్తోంది. 'కుంటోడినయ్యా! కుంటోడినయ్యా!' అంటే, జాలిగల మారాజులు ఒకటి-రెండు కాన్లు యిస్తున్నారు. కాని నా ఉద్యోగం యెప్పుడూ ఒకే వీధిలో, ఒకే వూళ్ళో చేసేదికాదు. స్థలం మారితేగాని ఫలం దక్కదు. కాని ఈ కుంటితనంవల్ల సాహసించి ఏ రైల్లోనూ ఎక్కలేకపోతున్నాను. ఎందుకూ పనికిరానివా ణ్ణయిపోయాను......అయితే, నేనొక్కడనేనా?—కాదు! నాలాంటివాళ్లు ఎంతోమంది వున్నారు.........."అబ్బ! రోజు రోజుకు ఈ భిక్షుగాళ్ళ సమస్య చాల గడ్డుగా పరిణ మిస్తోంది" అంటా డొకబాబు. "ఎక్కడచూసినా ఈ

అడుక్కునేవాళ్ళ పోరెక్కువై పోయింది” అంటాడొక పెద్ద మనిషి. “ఈసారి పార్లమెంటులో భిక్షగాళ్ళ బిల్లొకటి ప్రవేశపెడతాను” అంటాడొక ప్రభువు............కాని బాబూ! ఆ పెద్ద పెద్ద మాటలు నా కర్థంకావు. అయినా బాబూ! నాది ఒకే ప్రశ్న—మాకోసం మీరు ఒక్క పూటైనా అన్నం మానేశారా? ఒక్కనాడైనా చక్కని బట్ట తొడక్కుండా వున్నారా? మేం పోరెందుకు చేస్తాం బాబూ?—ప్రాధేయపడి అడుగుతాం. ఏదో, మీదగ్గర వుంటే వచ్చిన భిక్షగాడికి ఒక్కొక్క కానీ వేస్తుండండి - చాలు. అయినా మాదొక పెద్ద సమస్యే! కాని బాబూ, ‘సమస్య - సమస్య’ అంటూ కూచుంటే లాభమేమిటి? ఏదోవిధంగా పరిష్కారమార్గం చూడాలిగాని! భిక్షావృత్తిని ప్రోత్సహించమని నేను చెప్పను, భిక్షగాళ్ళ బ్రతుకెంత హీనమైందో నాకు బాగా తెలుసు. తిండి, బట్ట, నీడ— ఈ మూడు వుండే రోజు భిక్షగాని జీవితంలో వుండదు బాబూ! ఏదో అంటున్నానని కోప్పడకండి. భిక్షగాణ్ణి మాత్రం మధ్యలో చంపవద్దు; బాబూ! మిమ్మల్ని, భగవంతుణ్ణి నేను కోరేది ఒక్కటే—అసలు అడుక్కునేవృత్తినే పూర్తిగా నిర్మూలం చెయ్యండి. కాని దీనికి ముందుగా, అసలు భిక్షగాళ్ళు ఎలా పుడుతున్నారో, ఎందుకు పుడుతున్నారో ఆలోచించండి. ఆత్మాభిమానం గల మనిషి,

మానవత్వాన్ని మరచిపోయి, భిక్షుగాడిగా ఎందుకవుతున్నాడో యోచించండి. చాలు.........తర్వాత అడుక్కునేవాళ్ళను నాశనం చెయ్యవచ్చు. భిక్షమెత్తుకోడం నాకు సరదా కాదు.....ఒక్కొక్క బాబు దగ్గర చెయ్యి చాస్తుంటే, నాలోని ఒక్కొక్క ప్రాణం లేచిపోతుంటుంది. అయినా బ్రతికే వున్నాను. బ్రతక్కుండా వుండలేను... చచ్చిపోతే మీరంతా నన్ను, నా సోదరుల్ని, మా సమస్యను మరచిపోతారు.........అదీగాక, ఒకరు సుఖంగా బ్రతుకుతుంటే, మరొకరు దుఃఖంతో చావడమెలా సాధ్యమౌతుంది? అందుకే బ్రతుకుతున్నాను, బ్రతుకుతాను. మీరు నా సమస్యను పూర్తిగా పరిష్కరించేంతవరకు బ్రతుకుతాను, ఎంత హీనమైన జీవితాన్నైనా గడుపుతాను.........కాని మీరు నన్ను, నా సమస్యను మాత్రం మరచిపోవద్దు ; మీరు మరచిపోకుండా గుర్తు చేస్తూనేవుంటాను.........

భిక్షుగాడిని బాబూ !
మోక్షమన్నది లేదా ?
నాకు మోక్షమే లేదా ? ?
మెతుకుల కోసం
నా బ్రతుకంతా
బలి కావలసిందేనా ? ॥ భి ॥

బీదవాడినమ్మా!
బాధల బొమ్మనమ్మా!!

నా చితికిన అతుకుల
బ్రతుకును చూడండీ!
నా సమస్యను కొంచెం
పరిష్కరించండీ!
బీదవాడినమ్మా!
భిక్షగాడిని బాబూ!

[ పాడుకుంటూ ప్రక్కవీధిలోకి వెళుతుండగా— తెర ]



# ఓడిపోయాం... ...లేదు జయించాం! (నాటిక)

పాత్రలు : వేణు - వాణి

## (మొదటి దృశ్యం)

[ వెన్నెలరాత్రి, ఆకాశమంతా స్వచ్ఛంగాఉంది. వీధి చివర రావిచెట్టుదగ్గర చంద్రుడు తన ప్రతాపమంతా చూపుతున్నాడు. ఆ చెట్టుక్రింద నీడలో నిలచి వేణు ఎవరికోసమో నిరీక్షిస్తూ, చిన్నగా పాడుతున్నాడు. ]

వేణు : చెలియా! ఓ చెలియా!

హృదయ కుహరములోన
మధుర స్మృతుల జ్యోతి
వెదజల్లి నా మదిని
కదలింప, అదలింప,

చెలియా! ఓ చెలియా!
వచ్చిపో, నీ మనసిచ్చిపో!

తిమిర ఘోషను త్రోసి,
అమరచంద్రిక నుంచి,
భ్రమరమ్మలా నా హృదికి,
రిమ్మనుచు, జిమ్మనుచు

చెలియా! ఓ చెలియా!
వచ్చిపో, నీ మనసిచ్చిపో!!

[ వాణి వెనుకనుంచివచ్చి వేణు కళ్ళుమూస్తుంది. ]

వేణు : వాణీ !
వాణి : (చేతులు తీసి) వేణూ !
వేణు : ఈ ప్రశాంత సమయంలో... ... ...
వాణి : పరిమళ భరితమైన పిల్లగాలులు మెల్లగా వీస్తూ ఉండగా... ... ...
వేణు : చంద్రుని చల్లని, తెల్లని వెన్నెల్లో... ... ...
వాణి : మధుర స్వప్నాల్ని ఊహించుకుంటూ... ... ...
వేణు : భూలోక స్వర్గంవంటి ప్రేమ వీధుల్లో విహరిస్తూ, నిన్ను చూస్తూ జీవితమంతా ఇలాగే గడపాలని ఉంది. (తదేక దృష్టితో చూస్తుంటాడు.)
వాణి : అబ్బా ! ఏమిటా చూపు ?
వేణు : వలపుల పిలుపు.
వాణి : (కొంటెగా) ఆఁ ? ఏ అధికారంతో ?
వేణు : ఈ విశాల విశ్వంలోని ఏ నియమానికీ లొంగని ప్రేమాధికారంతో.
వాణి : ఎవరిచ్చారు నీ కా అధికారం ?
వేణు : చెప్పాలా ?
వాణి : మళ్ళీ అనాలా ?
వేణు : అయితే విను. నీ విశాల నేత్రాలలోని సూదంటు రాయివంటి చూపు, నీ అరుణాధరాలనుండి చిందే చిరునవ్వుల పిలుపు, నీ ముఖారవిందంలోని లేత కాంతుల మెరుపు, అన్నిటికంటే, ఈ ప్రశాంతమైన వినీల ఆకాశంలోని చంద్రుని చల్లనిచూపు, మన

యవ్వనమాధుర్యంలోని మైమరపించే తీయని వలపు—
నా కీ అధికారాన్ని యిచ్చాయి, వాణీ!

వాణి : కవివై పోతున్నావే!

వేణు : లేదు వాణీ! నేను కావాలని అవడంలేదు. కాని, ప్రేయసి యెదురుగా వుంటే, ప్రియుని పెదిమలనుండి కవిత్వం తనకు తానై అవిరళధారగా ప్రవహిస్తుంటుంది.

వాణి : ఎందువలన ?

వేణు : ప్రేమవలన.

వాణి : ప్రేమకు ముఖ్యాధారం ?

వేణు : ప్రేమికుల హృదయం.

వాణి : సౌంద్యం కాదా ?

వేణు : కాదు వాణీ! ప్రేమకు సౌందర్యంతో సంబంధం లేదు. సౌందర్యం ప్రేమమీద ఆధారపడి ఉంటుంది. ప్రేమే సౌందర్యాన్ని సౌందర్యవంతంగా చేస్తుంది. వాణీ! లైలా గొప్ప సౌందర్యవతి కాకపోయినా, మజునూ హృదయంలో, ఆమెయందు పవిత్రమైన ప్రేమ జనించడంవలన, వారి ప్రేమ ఉన్నతశిఖరాన్ని అధిష్ఠించింది..

వాణి : ప్రేమలో భేదాలుకూడా ఉన్నాయా ?

వేణు : ఔను వాణీ! ఎన్నో భేదాలున్నాయి. అందులో పవిత్రప్రేమ, కులమతాలకు-శాసనాలకు వంగకుండా, స్వార్థానికి లొంగకుండా, సౌందర్యాన్ని అపేక్షించ

కుండా ప్రణయశిఖరాన్ని అందుకుంటుంది. కాని, ఇతర ప్రేమలన్నీ దీనికి విరుద్ధంగానే ఉంటాయి.

వాణి : ప్రేమకు ప్రధానం...?

వేణు : ప్రేమకు ప్రేమతోనే ప్రధానం—హృదయంతో సంబంధం అంతే. ప్రేమ, ప్రేమికుల హృదయాంతరాళాల్లో పెద్ద పెద్ద పునాదులమధ్య వేరులు కట్టుకుని పాతుకుపోతుంది. దానిని ప్రళయంగాని, మహా ప్రళయంగాని, అంతకన్నా ఏదైనా గొప్పది ఉన్నా విడదీయ లేదు.

వాణి : బాగానేవుంది... ... ...అయితే?... ...

వేణు : అయితే... ...ఏమిటి వాణీ?

వాణి : మన ప్రేమపూదోటకు పునాదులు వేయాలి.

వేణు : పునాదులా?

వాణి : అవును, వేణూ!

వేణు : నన్ను పరీక్షిస్తున్నావా, వాణీ?

వాణి : లేదు వేణూ! నిజమే.

వేణు : ఐతే, మన ప్రేమ యింతకాలం పునాదులులేని గాలి మేడా, వాణీ?

వాణి : కాదు, మన హృదయాల్లోపునాదులు పడినయ్.

వేణు : మరి... ...?

వాణి : మన యిద్దరిహృదయాల్లో పుట్టి, వేరులు కట్టుకుని పెరిగి, పెద్దదై, పెనవైచుకున్న ఈ ప్రేమలత పుష్పించి, ఫలించాలంటే... ... ...

వేణు : అంటే... ...?

వాణి : మన పెద్దల ఆశీర్వాదం, అనుమతి వుండాలి.

వేణు : కాని మీ నాన్న ఒప్పుకుంటాడా ?

వాణి : మీ అమ్మమాత్రం ఒప్పుకుంటుందా ?

వేణు : పోనీ, మనం యెక్కడికైనా వెళ్ళిపోతేనో ?

వాణి : లేచిపోవడమా ?

వేణు : కాదు వాణీ! ఎక్కడికైనా వెళ్ళి వివాహం చేసుకుందాం.

వాణి : ఐనా సంఘం లేచివచ్చారనే అంటుంది వేణూ!

వేణు : సంఘంతోను, సంఘాధికారులతోను మనకు పనిలేదు, వాణీ!

వాణి : మనకు లేకపోయినా, మనం చేసేపనివలన మన తర్వాత వాళ్ళు బాధపడతారు.

వేణు : అంటే ?

వాణి : నేను నీతో వచ్చి—తర్వాత వివాహం చేసుకున్నా, సంఘం నన్ను 'లేచిపోయినమనిషి', 'కులట' అని తప్పక అంటుంది. దీనినిగురించి నాకు విచారంలేదు. కాని, నా యీ అపరాధానికి నా చెల్లెల్ని పీడిస్తుంది, ఈ పాడుసంఘం. ఆమెనుకూడ బహిష్కరిస్తుంది. అది నేను చూడలేను.

వేణు : అదేమిటి వాణీ! నాకుకూడా ఒక తమ్ముడున్నాడన్న విషయం మరచిపోయావా ?

వాణి : లేదువేణూ! కాని పురుషుల విషయంలో అంత బాధ ఉండదు.

[ రెండు క్షణాలు నిశ్శబ్దం. ]

వేణు : వాణీ! మనమిద్దరం చాలవరకు బాధ్యతగల వ్యక్తులం. లోకజ్ఞానం లేనివాళ్ళంకూడకాము. ఇంత బాధపడటం, పెద్దవాళ్ళకు భయపడి లేచిపోవడం దేనికి? మా అమ్మను నేను అడిగి ఒప్పిస్తాను. నువ్వు మీ నాన్న నడిగిచూడు.

వాణి : ప్రయత్నిస్తాను.

వేణు : ప్రయత్నించడంకాదు వాణీ—శక్తినంతా వినియోగించి ఒప్పించాలి.

వాణి : నీకోసం ఏమైనా చేస్తాను, వేణూ!

వేణు : నా ముద్దుల వాణీ!

( తెర )

## రెండవ దృశ్యము

[ మర్నాడు. అదే స్థలం. అదే సమయం. వేణు కాస్సేపు పచార్లుచేసి, చిన్నగా పాడుతుంటాడు. ]

వేణు : ఓ చెలీ! నా చెలీ!

నా హృదయ మందిరములో
నీ వొక మధుర వీణవై తే,
నే నొక సురాగ తంత్రినై,
సంగీత కళా వాహినినే
పొంగిస్తాం! పులకిస్తాం!!

ఓ చెలీ! నా చెలీ!
నా చెలీ! ఓ చెలీ!!

[ వాణి వచ్చి చెట్టుకు ఆనుకుని నిలబడుతుంది. ]

వేణు : వాణీ!
వాణి : వేణూ!
వేణు : ఇంత ఆలస్యం చేశావేం, వాణీ?
వాణి : ఔను. కొన్ని నిమిషాలు ఆలస్యమయింది.
వేణు : జీవిత పరిమాణంలోని, మధుర ప్రణయానికి చెందిన స్వల్పకాలంలోని కొన్ని నిమిషాలు వృధాకావడానికి, ఏ పవిత్ర ప్రేమహృదయం అంగీకరిస్తుంది, వాణీ?
వాణి : నేనుమాత్రం ఊరకనే వృథాచేశానా, వేణూ?
వేణు : ఏంచేశావ్?
వాణి : మా నాన్నను... ... ...
వేణు : అడిగావా?
వాణి : ఔను... ...
వేణు : ఏమన్నాడు?
వాణి : నా నోటితోనే చెప్పమంటావా, వేణూ?
వేణు : చెప్పు, వాణీ! త్వరగా చెప్పు.
వాణి : ఈ వ్యథిత అధరాలతో వెల్లడించలేను, వేణూ!
వేణు : ఆఁ! నిరాకరించాడా?
వాణి : (మాట్లాడదు.)
వేణు : నాలో ఏంలోపం ఉంది, వాణీ?
వాణి : నా కళ్ళకు ఏలోపం లేదు, వేణూ!
వేణు : మేము మీకంటే తక్కువ డబ్బున్నవాళ్ళమా?
వాణి : కాదు.
వేణు : మా కులంతక్కువా?

వాణి : అదీకాదు.

వేణు : వాణీ! ఎందుకు నా హృదయాన్ని బాధపెడతావ్ ? మన ప్రణయశిఖరం హిమాలయాన్ని కూడ సిగ్గు పరచగలిగేంతగా ఉన్నతపథాన్ని అందుకుంది ; మహాసాగరంలోని లోతునైనా కొలవవచ్చు, కాని మన ప్రేమను కొలవడం కష్టం. మనస్సులు మాట్లాడుకున్నాయ్, హృదయాలు పెనవైచుకున్నాయ్. ప్రేమించుకున్నాం, పవిత్ర వివాహబంధంలో మన ప్రేమను పటిష్ఠం చేసుకోవాలనుకున్నాం. ఇహ, సందేహం దేనికి ?

వాణి : సందేహ మేమీ లేదు.

వేణు : మీ నాన్న వివాహానికి అంగీకరించక పోవడానికి కారణం ?

వాణి : వివాహం చేసుకోమన్నాడు కాని... ...

వేణు : కాని... ...ఏమిటి వాణీ ?

వాణి : (మాట్లాడదు.)

వేణు : చెప్పు, వాణీ !

వాణి : ని — న్ను — త — ప్ప... ...

వేణు : ఆఁ !

వాణి : (నిశ్శబ్దంగా తల వంచుకుని వుంటుంది.)

వేణు : నన్ను తప్ప యెవరినైనా చేసుకోమన్నాడా ?

వాణి : ఔను, వేణూ !

వేణు : నేనేం అపరాధంచేశాను, వాణీ ?

వాణి : నువ్వేమీ చేయలేదు.

వేణు : నేనేకాదు—ఎవరుచేసినాసరే, సవరించడానికి ప్రయ త్నిస్తాను. చెప్పు, వాణీ!

వాణి : చెప్పినా అది సవరణకాదు, వేణూ!

వేణు : ఐనా, చెప్పు వాణీ! ఈ రహస్యాన్ని నీలోనే పెట్టు కుని, నా హృదయానికికూడ ఆవేదన కలిగించకు. చెప్పు. చెప్పకపోతే నామీద ఒట్టు.

వాణి : చెప్పినతర్వాత మనస్సులో బాధపెట్టుకుంటే, నా మీద ఒట్టు.

వేణు : లేదులే, చెప్పు.

వాణి : ఇరవై సంవత్సరాల క్రితం — మీ నాన్నగారు జడ్జిగా ఉన్నప్పుడు—మా నాన్నకు ఒక సంవత్సరం కఠినశిక్ష వేశారట!

వేణు : ఊరక నేనా?

వాణి : ఏదో ఖూనీ విషయంలో.

వేణు : మీ నాన్న ఖూనీ చేశాడా?

వాణి : లేదట!

వేణు : అంతకుముందు మా నాన్నకు, మీ నాన్నమీద కోపమా?

వాణి : లేదట. ఇద్దరు చాల స్నేహంగా ఉండేవారట.

వేణు : అయితే, మా నాన్న, మీ నాన్నకు పూరకనే శిక్ష విధించాడంటావా, వాణీ?

వాణి : ( మాట్లాడదు. )

వేణు : అయినా, ఎప్పుడో పెద్దలుచేసిన అపరాధానికి, యిప్పుడు మనమీద నేరం వెయ్యడం, పగదీర్చుకోడం బాగుందంటావా ?

వాణి : ఎన్నటికీ అనలేను.

వేణు : మీ నాన్నకు నువ్వు నచ్చజెప్పలేవా ?

వాణి : ఎన్నో విధాల ప్రయత్నించాను కాని; ఫలితం కన్పించడం లేదు.

వేణు : ఇంతకూ ఆయన అంతిమనిర్ణయ మేమిటి ?

వాణి : అదే. నిన్నుతప్ప, ఎవరినైనా సరే వివాహం చేసుకోమన్నాడు.

వేణు : బాగుంది. ఇద్దరూ ఒకేరకం మనుషులు.

వాణి : ఎవరిద్దరు ?

వేణు : మీ నాన్న మా అమ్మ.

వాణి : అంటే ?

వేణు : మీ నాన్న చెప్పినట్టే, మా అమ్మ చెప్పింది; మా అమ్మ అన్నట్టే, మీ నాన్న అన్నాడు.

వాణి : మీ అమ్మ ఏమంది ?

వేణు : అదే ! మీ నాన్న అన్నట్టే—నిన్ను తప్ప ఎవరినైనా సరే, వివాహం చేసుకోమంది.

వాణి : ఆఁ ? ఎందుచేత ?

వేణు : ఎందుకోలే !

వాణి : చెప్పు, వేణు ! ఆ కారణమేమిటో వినాలని, నా మనస్సు ఆరాటపడుతోంది.

వేణు : చెప్పిన తర్వాత మనసులో బాధ పెట్టుకుంటే, నామీద ఒట్టు.

వాణి : లేదు. బాధ పెట్టుకోను, చెప్పు.

వేణు : పదహారు సంవత్సరాల క్రితం—అంటే, నాకు ఆరు సంవత్సరాల వయస్సప్పుడు—మా నాన్నకు జ్వరం వస్తే, మీ నాన్న చికిత్స చేస్తూ, విషం యిచ్చి చంపేశాడట !

వాణి : ఆఁ ! నిజమా ?

వేణు : నిజం ! మా అమ్మ భగవద్గీతసాక్షిగా చెప్పింది.

[ వాణి వచ్చే దుఃఖాన్ని ఆపుకోడానికి ప్రయత్నిస్తూ, పయిట చెరగు పంటితో కరచుకొని, పరుగెత్తుకుంటూ వెళ్ళిపోతుంది. తెర ]

## మూడవ దృశ్యము

[ అమర్నాడు, అదేస్థలం. అదే సమయం. కాని, ఆకాశం అంత స్వచ్ఛంగా లేదు. మేఘాల ప్రతిభను ఆక్షేపించలేక, అప్పుడప్పుడు చంద్రుడు భయంతో దాక్కొంటున్నాడు. ఒక్కొక్కప్పుడు రాపిచెట్టుఆకుల సందుల్లోంచి మెరుపుల కాంతి—సూదిలోని దారంలా - వస్తూఉంది. ఉన్నట్లుండి చిన్నగా వినిపించే మేఘగర్జన వేణు పాటకు తాళం వేస్తున్నట్టుంది. ]

వేణు : నీ సుకుమార కరాల వీణ,
వీణలోని తీగెల వాణి,
వాణిలోని తీయని బాణి,
బాణిలోని కోమల ధ్వని

మరువలే నే నెన్నటికి గాని!
నీ విశాల హృదయ రాగం,
రాగములోని దివ్యతాళం,
తాళములోని నవ్యభావం,
భావముపై హృదయోద్వేగం
మరువలే నే నెన్నటికినిగాని!

[ వాణి వచ్చి నిలబడి పాట ఆలకిస్తుంది. పాట ముగియగానే దగ్గరకు వస్తుంది. ]

వాణి : వేణూ!

వేణు : వాణీ!

వాణి : నీ కంఠంలోని యీ కమ్మదనం ఏ కోయిలనుండి దొంగిలించావ్!

వేణు : కోయిలను కూడ సిగ్గుపరచే నీ కంఠంనుండి.

వాణి : ( మాట్లాడదు. )

వేణు : అలా ఉన్నావేం వాణీ?

వాణి : ఇహ నన్ను మరచిపో వేణూ!

వేణు : నన్నెందుకు చిన్నబుచ్చుతావు, వాణీ! నిన్ను మరచిపోలేనని, యిప్పుడు పాడిన గీతంలోనే చెప్పానుగా!

వాణి : గత్యంతరం లేదు వేణూ! విధి మనల్ని వేరుచెయ్యడానికి పగబట్టి కూర్చుంది.

వేణు : విధేకాదు వాణీ—పంచభూతాలు ఒక్కసారి దద్దరిల్లి, బ్రద్దలై పెద్ద పెద్ద అగ్గిపిడుగుల్ని వర్షింప

జేస్తూ, తుపాను చెలరేగించి, భూకంపాన్ని లేవదీసి, మహా ప్రళయాన్ని తీసుకొచ్చినా మనల్ని వేరు చెయ్యలేవు.

వాణి : ఎందుచేత ?

వేణు : మనది పవిత్రప్రేమకనుక.

వాణి : కాని, పవిత్రప్రేమ కోరేదేమిటో తెలుసా వేణూ ?

వేణు : ఏమిటి ?

వాణి : ఆహుతి—బలి.

వేణు : అందుకు నేను సిద్ధంగా వున్నాను.

వాణి : ఆఁ !... ...

వేణు : మన పెళ్ళివిషయమై మా అమ్మను యివ్వాళ చాల తీవ్రంగా అడిగాను. ఆమె నిర్మొహమాటంగా నిరాకరించింది. ఇంట్లోంచి వెళ్ళిపోతా నన్నాను... ...

వాణి : నిజమా ? ... ... ...

వేణు : పూర్తిగా విను. మా అమ్మ హృదయం దయకు కరుణకు నిలయం. కాని మన విషయంలో కఠిన శిలగా మారింది.

వాణి : ఏమంది వేణూ ?

వేణు : నిన్ను వివాహం చేసుకున్నట్లయితే, తాను ఆత్మహత్య చేసుకుంటానంది.

వాణి : బాగుంది ... ఇద్దరూ ఒకేలా అన్నారు.

వేణు : ఎవరిద్దరు ?

వాణి : ఇంకెవరు ? మీ అమ్మ, మా నాన్న.

వేణు : మీ నాన్నకూడ యిలాగే అన్నాడా ?

వాణి : ఇంతకంటె కొంచెం కఠినంగా.

వేణు : ఏమన్నాడు, వాణీ!

వాణి : ఒక విషంసీసా నాకిచ్చి, నిన్ను మరచిపోలేకుంటే, దాన్ని త్రాగమన్నాడు.

వేణు : నిజమా?... ... ...

వాణి : పూర్తిగా విను. ఆయన్ని ధిక్కరించి నీతో ఎక్కడి కైనా వచ్చేస్తే, వెదికి పట్టుకుని యిద్దర్నీ చంపుతా నన్నాడు.

వేణు : మీ నాన్నకు మనమీద ఎందుకింత పగ వాణీ?

వాణి : మనమీద పగలేదేమో—మనం ప్రేమించుకోవడం అంటే ఆయనకు కోపం.

వేణు : ఎందుకో?

వాణి : ఏంచెప్పను వేణూ! ఆయనకు నువ్వు—అంటే ఒక శత్రువు కొడుకు—అల్లుడు కావడం యిష్టంలేదు.

వేణు : బాగుంది. అంతా యింద్రజాలంలా ఉంది.

వాణి : ఏమిటి?

వేణు : మీ నాన్న అన్నట్టే, మా అమ్మ అంటుంది; మా అమ్మ అన్నట్టే, మీ నాన్న అంటాడు.

వాణి : మీ అమ్మ ఏమంది?

వేణు : నా తండ్రిని చంపిన వ్యక్తి కూతుర్ని, తన కోడలిగా చేసుకోవడం అసంభవమంది... ... (ఒక్క క్షణం నిశ్శబ్దం.)

వాణి : వేణూ!

వేణు : వాణీ!

వాణి : ఇహ మనకీ జీవితంలో విజయం కలగదు. నన్ను మరచిపో వేణూ!
వేణు : మరచిపోవడమా ?
వాణి : ఔను. పూర్తిగా మరచిపో. నేను వెళ్ళిపోతున్నాను.
వేణు : ఎక్కడికి ?
వాణి : ఏ నియమాలు, ఏ బంధనలు లేని మరో ప్రపంచానికి.
వేణు : ఇది నీ అంతిమ నిర్ణయమా వాణీ ?
వాణి : ఔను వేణూ! (ఆగి) వాణి నీది. వాణి హృదయం నీది. నీదిగానే ఉంటూ ఆ లోకంలో నిరీక్షిస్తూ ఉంటుంది.
వేణు : అదంతా భ్రమ వాణీ! చచ్చి సాధించేదేముంది ?
వాణి : బ్రతికి సాధించేదికూడ లేదు. కాని నేను చచ్చిపోతే, నాతండ్రి హృదయానికైనా శాంతి లభిస్తుంది.
వేణు : అయితే నేనుకూడ వస్తాను వాణీ!
వాణి : నువ్వుకూడానా ?
వేణు : ఔను వాణీ! మన పెద్దల కఠిన శత్రుత్వం మన శరీరాల్ని వేరుచెయ్యగలదు. కాని హృదయాల్ని మార్చలేదు.
వాణి : బాగా ఆలోచించు వేణూ! నేను చనిపోయినా విచారించేవాళ్ళు, అంతగా లేరు. కాని, మీ కుటుంబమంతా నీమీద ఆధారపడి ఉంది.
వేణు : ఇహ ఆలోచించలేను, వాణీ! నువ్వులేని ఈలోకమే అక్కరలేదు. 'పవిత్రప్రేమ' అంటే ఏమిటో తెలు

సుకోకుండా, స్వార్థానికి, శత్రుత్వానికి, కులమతాలకు నిర్మల హృదయాల్ని బలిచేసే ఈ పాడులోకంలో ఉండేకంటే, నువ్వు చెప్పినట్లు మరోలోకం ఉంటే-అక్కడ సుఖపడగలం. లేకపోతే, కనీసం నిద్రావస్థ వంటి ఆ మహామృత్యువు ఒడిలో శాశ్వతమైన శాంతి శ్వాసను తీసుకోగలం.

వాణి : అయితే, ఇది తీసుకో. (చిన్నసీసా యిస్తుంది.)

వేణు : ఏమిటిది ?

వాణి : విషం. మా నాన్న నన్ను త్రాగమని యిచ్చాడు.

[ చంద్రుడు మబ్బుల చాటున దాక్కున్నాడు. నాలుగుమూలల చీకటి వ్యాపించింది. అప్పుడప్పుడు మెరుపులు తమ ప్రతిభను వెల్లడిస్తున్నాయి. ]

వేణు : బాగుంది. (నోట్లో వేసుకోడానికి మూత తీస్తాడు.)

వాణి : కాని, వేణూ ! (వేణు ఆతృతగా చూస్తాడు.) మనం ఈ విశ్వాన్ని విడిచిపెట్టడానికి సిద్ధంగా ఉన్నాం. కాని నాకొక కోరిక ఉంది.

వేణు : ఏమిటి వాణీ !

వాణి : మన కుటుంబాల్లో బంధుత్వాన్ని నెలకొల్పడం.

వేణు : ఇది సాధ్యమా ?

వాణి : ఔను. మన ఆహుతి ఆమాత్రం సహాయం తప్పక చేస్తుంది.

వేణు : ఎలా ?

వాణి : నా చెల్లెల్ని మీ తమ్ముడు వివాహం చేసుకుంటే...

వేణు : మనం సాధించలేని పని, వాళ్ళెలా సాధిస్తారు, వాణీ!

వాణి : వాళ్ళు సాధించనక్కర్లేదు, మన మృత్యువు సాధిస్తుంది.

వేణు : నా కర్థం కావడంలేదు, వాణీ!

వాణి : ఇదిగో చూడు. ఈ ఉత్తరంలో మా నాన్నకు, మీ అమ్మకు, మనమిద్దరం కలసి వ్రాసినట్లుగా — మా ఆత్మలు శాంతించాలంటే, మీ శత్రుత్వాన్ని విడిచి పెట్టి, వాళ్ళిద్దరకు వివాహం చెయ్యండి—అని వ్రాశాను.

వేణు : బాగుంది.

వాణి : నువ్వుకూడా సంతకం చెయ్.

వేణు : నీ తెలివితేటలు అమోఘం వాణీ! ఈ ఉత్తరం చూడగానే నా హృదయం ఎంతో తేలికపడినట్లుంది. ఏదీ సంతకం చేస్తాను. (సంతకం చేస్తాడు.)

వాణి : నాహృదయంకూడ తేలికయింది వేణూ! (సీసాలోని విషం నోట్లో వేసుకుంటుంది.)

వేణు : వాణీ! నేనూ వస్తున్నా. (విషం నోట్లో వేసుకుంటాడు.)

[ వాతావరణం భయంకర రూపాన్ని దాల్చింది. మెరుపులు, ఉరుములు, పిడుగులధ్వని-అట్టహాసంగా ఉన్నాయి.

వాణి : వేణూ! ఇదేనా ప్రేమకు ఫలితం? (పడిపోతుంది.)

వేణు : ఔను వాణీ! ఈ పాడు ప్రపంచంలో ప్రేమకు విలువేలేదు! (పడిపోతాడు.)

వాణి : వేణూ!...ఆఖరికి మనం... ప్రేమను సాధించలేక పోయాం... ...

వేణు : లేదు వాణీ! పూర్తిగా... సాధించాం.

వాణి : వేణూ!...మనం...ఓడిపోయాం...

వేణు : లేదు...జయించాం!

వాణి : వేణూ! ...

వేణు : వాణీ! ...

వాణి : వే...ణూ... (కళ్ళు మూసింది.)

వేణు : వా...ణీ... (కళ్ళు మూశాడు.)

[ మెరుపులు మెరిశాయి, పిడుగులు పడ్డాయి, ప్రకృతి తీవ్రరూపాన్ని దాల్చింది. తెర. ]



# సర్వోత్తమమైన మా యితర ప్రచురణలు

## కంటి మె[illegible]మెర

(మనోహరమైన నవల)

ఇది విశ్వకవి రవీంద్రనాథ్ [illegible] రచనకు తెలుగు అనువాదం. విశ్వకవి రచనలను గురించి వేరే చెప్పవలసిన పనే ఉండదు. సమాజంలో నిత్యం మన కళ్ళకు కనిపించే రకరకాల చరిత్రలు అతి మనోహరంగా చిత్రించబడ్డవి-ఇందులో. ఉదాత్తమైన గంభీరహృదయులు, నిగ్రహశూన్యులైన బలహీన చరిత్రులు, నిష్కపటలైన అమాయికలు, నివురుగప్పిన నెరజాణలు, సమాజ దౌష్ట్యాలు మొదలైన అనేక విషయాలు వివరింపబడిన ఈ పుస్తకం పూర్తిగా చదివి ఆనందించవలసినదే! దీనిని గురించి ఎంత వర్ణించినా తక్కువే అవుతుంది!

వెల రు. **4-8-0**      బైండు రు. **5-8-0**

## సన్యాసి

ఇది శ్రీ ఇలాచంద్ర జోషీగారి అపూర్వ రచన! మానవ మనస్తత్వాలమీద ఇదొక బృహత్సమీక్ష! సర్వ సామాన్యంగా నేటి యువకులలో ఉదయించే మహత్వాకాంక్షలు, అవి సఫలీకృతం కాకపోవడంవల్ల వారి మనస్సులలో విజృంభించే పెనుతుపానులు, ప్రళయంకరమైన ఆ పెనుతుపానులలో వారి జీవితనౌకలు చుక్కానివిరిగి లక్ష్య

హీనంగా పరిభ్రమించడం, మానవుని మనస్సులోపుట్టే ఆశా-పాతాళ భావాలు, వాటిమధ్యజరిగే ఘోరమైన తుములవాదాలు మొదలైన అనేకవిషయాలు మనకళ్ళకు కట్టినట్టు చూపించారు శ్రీ జోషీ ఈ నవలలో.

నిజంగా ఈ నవల పాఠకునిముందు ఒక క్రొత్తవెలుగును ప్రకాశింపజేస్తుంది; ఒక నూతన దృక్కోణాన్ని అలవడజేస్తుంది; పాఠకుని హృదయంలో విజ్ఞానాన్ని వికాసాన్ని వెదజల్లుతుంది - అంటే అతిశయోక్తి కాదు. ప్రతి వ్యక్తి తప్పక చదవవలసిన ఉత్తమ రచన. 700 పేజీల పెద్ద గ్రంథం, చక్కని బైండుతో రు. 7-8-0

## ప్రేమ్‌చంద్ నిర్మల

(ఒక కరుణామయ జీవితగాథ)

ఇందులో వృద్ధవివాహాలవలని అనర్థాలను నిరూపిస్తూ, గృహజీవితంలో అకారణమైన అనుమానాలకు తావిచ్చేవారు సంసారాలను ఎలా నాశనంచేసుకొంటారో అతిరసవత్తరంగా చిత్రించారు శ్రీ ప్రేమ్‌చంద్. బాలబాలికలు స్త్రీ పురుషులు వయోవృద్ధులు యావన్మంది చదివిగ్రహించవలసిన విషయాలెన్నో ఉన్నాయిందులో. చదవడంమొదలుపెడితే పుస్తకం పూర్తయేవరకు నిద్రాహారాలపైకి బుద్ధిపోదు. హిందీలో ఈ నవల లక్షలాది ప్రతులు ఖర్చయినవంటే దీని ప్రాముఖ్యతనుగురించివేరేచెప్పనక్కరలేదు. నేడే మీ ప్రతితీసుకోనండి.

356 పేజీలు; ముచ్చటైన త్రివర్ణముఖ చిత్రంతో

వెల రు. 3-0-0 లు మాత్రమే. బైండు రు. 4-0-0 లు.

## ప్రేమ్‌చంద్ నారీజీవనము

ఇది ప్రేమ్‌చంద్ అమరలేఖినినుండి వెలువడిన మహోత్కృష్టమైన కథలసంపుటి. భారతదేశపు స్త్రీల సమస్యలను వివిధ దృక్పథాలతో పరిశీలిస్తూ ఒక్కొక్క దృక్పథంతో ఒక్కొక సర్వాంగసుందరమైనకథనురచించారు శ్రీ ప్రేమ్‌చంద్. ప్రతి ఒక కథ ఒక వజ్రపుతునక. ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాలలో స్త్రీకి ఎటువంటి స్థానమున్నది? — ఎటువంటి స్థానముండాలి? సమాజంలో స్త్రీలకు జరిగే అన్యాయాలకు, అక్రమాలకు కారణమేమిటి? మొదలైన అనేక సమస్యలను సమీక్షిస్తూ వ్రాసిన ఉత్తమకథల సంపుటి. ప్రతి తెలుగుబిడ్డ తప్పక చదివితీరవలసిన సద్గ్రంథం.

ప్రథమ భాగం రు. **1-0-0**, తృతీయ భాగం రు. **1-8-0**
ద్వితీయ భాగం రు. **1-0-0**, బైండు రు. **4-8-0**

## ప్రేమ్‌చంద్ సేవాసదనము

నూతన దాంపత్యజీవితంలో సంభవించేఒడిదుడుకులు, వాటికిగల కారణాలు, తన్నివారణమార్గాలు సూచిస్తూ, వేశ్యాసమస్యమీద విపులమైన విమర్శను సాగించిన చక్కని నవల. పత్రికలచేత సమాలోచకులచేత వేనోళ్ల ప్రశంసింపబడిన సర్వోత్తమ రచన. వెల రు. **3-0-0**, బైండు రు. **4-0-0**

## ప్రేమ్‌చంద్ ప్రేమపీఠం

మతభేదాలు మానవజాతికి అనర్థదాయకమని ఋజువు చేస్తూ, నూతన దంపతులకు అమూల్యమైన గుణపాఠాల్ని నేర్పుతూ, సున్నితమైన హాస్యంతో పాఠకుల హృదయాలను కదిలించే చక్కని నాటకం. వెల రు. **1-0-0**

# తప్పక చదువదగిన
## ఉత్తమ పుస్తకాలు

| | | |
|---|---|---|
| సన్న్యాసి | (ఇలాచంద్ర జోషీ) | 7 - 8 - 0 |
| కంటి మెరమెర | (రవీంద్రనాథ ఠాకూర్) | 4 - 8 - 0 |
| నిర్మల | (ప్రేమ్‌చంద్) | 3 - 0 - 0 |
| సేవాసదనము | ( ,, ) | 3 - 0 - 0 |
| నారీజీవనము | ( ,, ) | 3 - 8 - 0 |
| ప్రేమపీఠం | ( ,, ) | 1 - 0 - 0 |

---

## అతి త్వరలో మేము ప్రచురించే
## మరికొన్ని ప్రఖ్యాత నవలలు

(1) ప్రేతము—ఛాయ (ఇలాచంద్ర జోషీ)

(2) సునీత (జైనేంద్ర కుమార్)

(3) కల్యాణి ( ,, )

(4) సుఖదా ( ,, )

---


ప్రకాశకులు :—

## ప్రేమ్‌చంద్ పబ్లికేషన్సు

వి జ య వా డ.

WRAPPER PRINTED AT THE B. N. K. PRESS (PRIVATE) LTD., MADRAS 26



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B142 |
| పుస్తకం పేరు | మిత్రద్వయం |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | Ci, Bci |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | kasimbi |
| పేజీలు విడదీసినది | kasimbi |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |